

"త్రిభంగి" నర్తకి శిల్పం

ఫొటో : వి. కేశవశర్మ.

సంవత్సర చందా
రు. 13-0-0
విడిపత్రిక 25న.పై.

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 52
సంచిక 12
**13-11-57**

**Founder : K. NAGESWARA RAO**

హేవిళంబి కార్తీకం, బహుళ షష్ఠి బుధవారం

 విషయానుక్రమణిక 

ముఖచిత్రం :

నర్తకి కుర్షీద్

★

# రెండవ భారీ ఉపగ్రహం

నెలరోజులు పూర్తి కాకుండానే రష్యన్ శాస్త్రజ్ఞులు మరొక కృత్రిమ చంద్ర గోళాన్ని ఆకాశంలోకి వదిలిపెట్టారు.

ఈ రెండవ గోళం మొదటి దానికంటె అనేక విధాల భిన్నమైనది. మొదటి దాని బరువు 183 పౌనులే కాగా, దీని బరువు సుమారు అరటన్ను. మొదటిది 560 మైళ్ళ ఎత్తునే తిరుగుతూండగా, ఇది 930 మైళ్ళ దాకా ఎగిరి తిరుగుతోంది. మొదటిది సుమారు 96 నిమిషాల కొకసారి భూమిని చుట్టిరాగా ఇది 102 నిమిషాల కొకసారి భూమిని చుట్టివస్తోంది.

అన్నిటికంటె చిత్రమేమిటంటే, మొదటి గోళంలో శాస్త్రీయపరికరాలే ఉన్నాయి. రెండవ గోళంలో ఒక కుక్క కూడా ఉంది. అంత ఎత్తున, అంత వేగంగా పరిభ్రమిస్తున్న గోళంలో ప్రాణులు సజీవంగా, యథాతథంగా ఉండడం సాధ్యమా కాదా అని పరీక్షించడానికి శాస్త్రజ్ఞులీసారి ఒక కుక్కను కూడా గోళంలో ఉంచారు. కుక్క కులాసాగానే ఉన్నట్లు తెలిసిందట.

రెండవ గోళం మొదటి గోళం లాగానే గంటకు 18 వేల మైళ్ళ వేగంతోనే తిరుగుతోంది. గాడి పెద్దది కావడంవలన భూమిని చుట్టిరావడానికి మాత్రం ఎక్కువ సేపు పడుతోంది.

మొదటి గోళం లాగానే రెండవ గోళం కూడా ఏవో రేడియో సాంకేతిక ప్రసారాలు చేస్తోంది. 20 మెగా సైకిళ్ళ మీద "బ్లీప్-బ్లీప్" అనే సంకేతాలు ఆగిఆగి వస్తున్నాయి. 40 మెగా సైకిళ్ళ మీద ఒకే ప్రవాహంగా సంకేత ధ్వని వస్తోంది.

## కుక్క సంగతి సరేసరి!

సూర్యకాంతిలోని షార్ట్ వేవ్ అల్ట్రావయొలెట్ కిరణాలను, రాంటైక్ 'ఎక్స్' కిరణాలను పరిశోధించడానికి తగిన పరికరాలు, విశ్వకిరణాలను పరిశోధించే పరికరాలు, ఆ ఎత్తున ఉష్ణతీవ్రతను, గాలిఒత్తిడిని పరిశోధించే పరికరాలు, సాంకేతిక సమాచారం తెలియజేసే రెండు రేడియోయంత్రాలు గోళంలో ఉన్నాయి. ఒకకుక్క, దాని హృదయస్పందనం, రక్తపుపోటు, శ్వాస తెలియజేసే పరికరాలు కూడా ఉన్నాయి. వీటన్నిటిబరువూ కలిపి దాదాపు 1100 పౌనులు.

ఇంత బరువుగల గోళాన్ని దాదాపు వెయ్యిమైళ్ళ ఎత్తుకు విసిరి తిరిగేట్లు చేయడానికి దాదాపు 500 టన్నుల బరువైన రాకెట్లను ఉపయోగించి ఉండాలని, అలా కాని పక్షంలో కొత్తరకం రసాయనిక ఇంధనాలనో, అణుశక్తినో ఉపయోగించి ఉండాలనీ పాశ్చాత్య శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. ఇదంతా నమ్మలేనంత అద్భుతంగా ఉందని, మొదటిగోళం ఆశ్చర్యం కలిగిస్తే, ఇది దిగ్భ్రాంతి కలిగించిందనీ టొరంటో విశ్వవిద్యాలయానికి చెందిన డా॥ జాక్ హోర్డ్ అన్నారు.

గోళంలోని కుక్కకు ఆహారంకూడా అందులోనే నిలవచేశారట. నిర్ణీతకాలాల్లో ఒక గంట మోగుతుంది. ఆ గంట మోగినప్పుడే తిండి తినేటట్లుగా కుక్కకు తర్ఫీదు ఇచ్చారు. ఈ కుక్క నేలమీదికి తిరిగి రావడానికి వీలుగా కొన్ని ఏర్పాట్లు చేశారు. కుక్కను ఉంచిన గోళం ఇన్నాళ్ళకి విడిపోయి కిందికి దిగుతుందట. దిగిరావడానికి రెండు మూడుగంటలు పడుతుంది. ఈలోగా అది సరిగ్గా ఎక్కడ పడుతుందో లెక్కలు వేసి నిర్ణయిస్తారు. ఇంకా కొన్ని వేల గజాల ఎత్తున ఉండగా గోళంకూడా విడిపోయి కుక్క పారాచూట్ ద్వారా నేలకు దిగుతుంది. ఈ కుక్క ఇంతకుముందే కొన్నిసార్లు రాకెట్లమీద పైకివెళ్ళి సురక్షితంగా దిగివచ్చినదట.

రెండవగోళం మొదటిదానికి వ్యతిరేక మార్గంలో తిరుగుతోంది. అయితే మొదటి దానిలాగానే దీని ప్రయాణరేఖ కూడా భూమధ్యరేఖకి 65 డిగ్రీల వాలులోవుందట.

ఈ రెండవ గోళాన్ని ప్రయోగించగలిగిన రష్యన్ శాస్త్రజ్ఞులు చంద్రుడిలోకి రాకెట్లను పంపించినా వింత ఏమీ ఉండదని ఇద్దరు పశ్చిమ జర్మన్ శాస్త్రజ్ఞులు అన్నారు.

మొదటి గోళాన్ని పంపించిన శాస్త్రజ్ఞుడని అందరూ అంటున్న ప్రొ॥ బ్లాగన్ రవావ్ అనే ఆయన, ఈ రెండవ గోళంవల్ల తెలిసే సమాచారం ఇంకా అద్భుతంగా ఉంటుందనీ, ఆకాశప్రయాణాలను ఇది ఇంకా సులభం చేస్తుందనీ వెల్లడించారు.

తమ శాస్త్రజ్ఞులు రష్యన్ విప్లవపు 40 వ వార్షికోత్సవానికి (నవంబరు 7) ఈ ద్వితీయ గోళ ప్రయోగాన్ని అంకితం చేశారని 'టాస్' వార్తాసంస్థ ప్రకటించింది.



## ఆంధ్రప్రదేశ్

ఆంధ్రప్రదేశ్ ప్రథమ వార్షికోత్సవం రాష్ట్రమంతటా వైభవంగా జరిగింది. రాజధానిలో రక్షకభట దళాల విన్యాసాలు నేత్రపర్వంగా జరిగాయి. గవర్నరు శ్రీ భీమసేన్ సచార్ గోషామహల్ పోలీస్ స్టేడియంలో జరిగిన ఈ విన్యాసాలను దర్శించి జాతీయాభివందనం స్వీకరించారు. ఉత్సవానికి ఆంధ్రమంత్రులు, స్పీకరు, శాసనసభ్యులు, న్యాయమూర్తులు, కాంగ్రెసు ప్రముఖులు హాజరయ్యారు.

మూడుకోట్ల ఆంధ్రులు ఏకమై, సువిశాల ఆంధ్రప్రదేశ్ ఏర్పడి సంవత్సరం గడచింది. తరతరాలుగా విడిపోయి ఉన్న ఆంధ్రులు ఒకే రాష్ట్రంగా ఏకమైనా, వారి మనస్సులు దృక్పథాలు ఏకం కాగలవా, పేచీలు పడకుండా సమష్టిగా వ్యవహరించగలరా అనే సందేహాల మధ్య ఆంధ్రప్రదేశ్ అవతరణం జరిగింది. ఒక ఏడాది సమష్టి సహజీవనం సాగించిన తర్వాత ఇప్పుడు "ఈ అనుమానాలన్నీ తీరి చక్కని వాతావరణం ఏర్పడిన"దని ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి వార్షికోత్సవ సందేశంలో వెల్లడించారు. ఐకమత్యంతో ప్రవర్తిస్తే ఆంధ్రప్రదేశ్ ను ఆదర్శరాష్ట్రంగా నిర్మించుకోగలమనికూడా ఆయన అన్నారు. రాష్ట్రంలో చక్కని వాతావరణం ఏర్పడడానికి తెలంగాణా ప్రజలు సహకరించడం కూడా ముఖ్య కారణమని ఆయన పేర్కొన్నారు.

గవర్నరు శ్రీ భీమసేన్ సచార్ సందేశమిస్తూ దేశాభివృద్ధికి రాష్ట్రంలోని అన్ని వర్గాలవారు కృషిచెయ్యాలని ఉద్బోధ చేశారు. ఈ వార్షికోత్సవదినం ఎవరికి వారు ఆత్మపరీక్ష చేసుకోవలసినదినమని ఆయన

(48-వ పేజీ చూడండి)

# తుంగభద్ర వద్ద 'కైలాస' చిత్రాలు



తుంగభద్ర 'డాం'కు ఉభయ పార్శ్వాలనా కొండలమీద ఉద్యోగులు, యాత్రికులు బసచేయడానికి వీలుగా రెండు అందమైన బంగళాలు నిర్మించారు. వీటిలో ఒకదానికి 'కైలాసం' అనీ, మరొకదానికి 'వైకుంఠం' అనీ నామకరణం చేశారు.



తుంగభద్ర ప్రాజెక్టువద్ద 'ముసాఫిర్ బంగళా'





"కైలాస శిఖరం"



# ప్రతిక్రియ

పెళ్ళి వైభవంగా జరుగుతోంది.

పెళ్ళికొడుకు గోపాలం లేచాడు. మంగళ సూత్రం కట్టాడు.

పెళ్ళికూతురు, మెళ్ళో కట్టించుకొంది మంగళసూత్రం, సిగ్గుతో.

తలంబ్రాలహడావుడికూడాఅయిపోయింది.

నీళ్ళ బిందె ఒకటి పెళ్ళికొడుక్కీ పెళ్ళికూతురుకీ మధ్యపెట్టారు. అందులో వేశారొక బంగారం ఉంగరం.

"రెడీ...వన్...టూ...త్రీ" అన్నారెవరో.

ఒక మొగ చెయ్యి, గాజుల చెయ్యి, బిందెలో దూరాయి జంటగా పోటీలు పడుతూ.

వేసిన క్షణం మొగచెయ్యి పైకివచ్చింది ఉంగరంతో.

గాజుల చెయ్యి వెతికిన ఉంగరంతో అలాగే ఉండిపోయింది. (సగం ఆశ్చర్యంతో.)

పెళ్ళికూతురు ప్రతిఘటించింది. మొహం జేవురించింది. కోపంతో, అన్యాయంతో, "మోసానికి ప్రతిక్రియ చేయా"లనుకొంది.

మళ్ళీ వేశారు ఉంగారాన్ని బిందెలో.

పెళ్ళికొడుకు బిందెలో చెయ్యిపెట్టాడు ఈసారి జంకుతూ.

అంతే! తేలుకాటులా గాఢిగా ఒక్క గిల్లుగిల్లి బయటికొచ్చింది గాజుల చెయ్యి వెనుకటి ఉంగరంతో.

"అయ్య బాబోయ్" అనబోయి నోరు మూసుకున్నాడు పెళ్ళికొడుకు.

అక్కడికా తంతు ముగిసింది.

*  *  *

## దివాకర్ల భగీరథరావు

హీరో గోపాలం (ఇంట్లోని వారందరూ "గోపీ" అని పిలుస్తారు. స్నేహితులంతా "గోప్" అంటారు ముద్దుగా.) ఆలోచించాడు. ఆలోచిస్తూనే ఉన్నాడు. కసికొద్దు ప్రతిక్రియ చెయ్యాలని ఆలోచించాడు. చించాడు పిచ్చి ఊహలు రాసిన కాగితాలు. ఆలోచించాడు రాత్రింబవళ్లు కూచుని.

తట్టిందో ఆలోచన. పట్టాడు కలాన్ని. పెట్టాడు దాన్ని కాయితం మీద. కలం పడుస్తోంది జోరుగా. లిఖించాడు ఉత్తరం.

చదువుకున్నాడు మళ్ళీ దాన్ని.

అప్రియమైన రాధకి,

నువ్వేమనుకొంటున్నావో కాని... నువ్వంటే నాకేమీ ఇష్టం లేదు. పెళ్ళిలోనే అంత గాఢిగా...మా యాతకిలాగ గిల్లావే. ఇంక పెళ్ళయితే ఇంకెంత గట్టిగా గిల్లి నా ఒళ్లంతా తూట్లు పొడుస్తావో. ఇంతకీ నిన్నని ఏం లాభంలే. అంతా మా "వాళ్లు" చేసిన తెలివితక్కువ పనికి. నా మతి మండిపోయి నిన్ను చేసుకొన్నాను. పై డాబులకి అందంగా ఉన్నావని కాని లేకపోతే నిన్ను చేసుకొనేవాణ్ణి కాను. తెలుసా? ఇంతకీ ఇదంతా ఏమిటంటావు? నా రా(ధ)త! నా రాతకొద్దీ దొరికావు కోతిపిల్లానివి. ఇప్పుడే చెప్పేస్తున్నా [రాస్తున్నాననుకో.] ఇకమీద నీకూ నాకూ ఏ సంబంధం లేదు. ఇదే రిజిస్టర్ నోటీసనుకో. [రిజిస్టర్ చేయిస్తున్నా.] ఇక మీద నీవుకాని, నీ తరఫువాళ్లుకాని చేసే సివిలు, క్రిమినలు చర్యలకి నే నెంతమాత్రం బాధ్యుణ్ణి కాదు.

# ప్రతిక్రియ

ఇంతే,
ఇంక నీకు మొగుడుకొని,
గోప్ ఉరఫ్ గోపాలం.

చదివి, బావుందనుకున్నాడు మనస్సులో. ఇంకోటేదో బావున్నట్లనిపించింది ఆ మనస్సులోనే. అదే...అదే...రాధ మొహం. రాధ లేకపోతే ఎలా! రాధకీ తనకీ పుట్టబోయే "బుడుగు" సంగతేమిటి? పెళ్లియే ముందరే అనుకొన్నాడు. ఇంచక్కా తనకి "బుడుగు" లాంటికొడుకు పుడతాడని. పేర్ల కాంబినేషన్ కూడా చక్కగా కుదిరిందని.

అంతే!

బుడుగుకోసమైనా తనకీ రాధకీ సంబంధం ఉండాలి అనుకొని చింపేశాడు ఉత్తరాన్ని.

ఇంక అదే ఆలోచన. ప్రతిక్రియ గురించి.

తక్కున ఒక అయిడియా మెరిసింది మనస్సులో!

సరే ననుకొన్నాడు. ఝామ్మని జట్కాలో వెళ్లిపోయాడు ఊరంతా చుట్టి రావటానికి.

శోభనం!

శోభనంగదిలో మంచంమీద కూచున్నాడు గోపాలం. సరిగా పదిగంటలకి గదిలో ప్రవేశించింది రాధ. గోపాలం గుండె ఒకసారి ఆగిపోయి మళ్లీ కొట్టుకోడం మొదలెట్టింది స్పీడుగా. గోపాలం లేచివెళ్లి తలుపేసేశాడు.

మంచంమీద కూర్చుని మొదలెట్టాడు సంభాషణ.

"రాధ! [తా!]" అని పిలిచాడు గోముగా.

ఉలకలేదు పలకలేదు పంచదార చిలకలా.

మళ్లీ పిలిచాడు. ఊహుఁ.

ఇది పనికాదనుకొని లేచివెళ్లి చెయ్యి పట్టుకొని లాక్కొచ్చి మంచంమీద కూచోపెట్టుకున్నాడు పక్కని.

"నా రాధవికదూ నువ్వు" అన్నాడు మెల్లిగా.

అవునని తలూపింది రాధ.

"మనిద్దరం భార్యాభర్తలం కదూ!"

అవునన్నట్లు తలూపింది రాధ.

"మనిద్దరం చేతులు కలుపుకొని హాయిగా అలా అలా స్వర్గసీమలో విహరిస్తాంగదూ!"

అవునన్నట్లు మళ్లీ తలూపింది రాధ.

"అయితే మనిద్దరం ఇలా చేతులు కలుపుకొని..." అంటూ గోపాలం రాధచేతులు రెండూ పట్టుకొని నాలుగుసార్లు ఊగించి, రాధ ఎడంచేతిమీద తన కుడిచేత్తో గిల్లేశాడు గాఠిగా.

అంతే! ఇంకేముంది. కథ అయిపోయింది.



# ఆంధ్రపత్రిక

సచిత్ర వార పత్రిక



# సంక్రాంతి ప్రత్యేక సంచిక

**[15-1-1958]**



ప్రధానాకర్షణ

## సినిమా శీర్షిక

చలనచిత్ర కళకు, పరిశ్రమకు సంబంధించిన
ప్రత్యేక వ్యాసాలు — చిత్రాలు



రసవంతమైన కథలు, గేయాలు
రమణీయమైన చిత్రాలు, ఫొటోలు

"వనితాలోకం" శీర్షికలో
ప్రత్యేక వ్యాసాలు — చిత్రాలు



ముగ్గులు — డిజైన్లు

రచనలు, చిత్రాలు అన్నిటిపైనా "సంక్రాంతి సంచికకు" అని వ్రాయాలి.



**1957 డిసెంబరు 15 లోగానే మాకు చేరాలి.**




రాజు ఆత్మకథ మొదలు పెట్టబోయేవరకు కొలంబస్ తుళ్లిపడి హోల్డాన్ అన్నాడు.

"బాబ్బాబు నీ పుణ్యం ఉంటుంది. నీ కథతో నన్ను లోమి తోమి వదలిపెటకు కన్నీళ్లు స్టాకులేదు. ఈ సారికి నన్నొది లెయ్" అన్నాడు.

"వాట్ సార్ నిన్న నాకు కాఫీకూడా ఇచ్చి అంత ఆదరించి మాట్లాడారే-అయ్యో అని విచారించారే—ఫరవాలేదని ధైర్యం చెప్పారే.-పెట్టె, సంచి ఇక్కడ పెట్టుకో వచ్చు నన్నారే—ఇవాళ ఇంత కోపం ఎందుకు నా మీద ఎడిటరుగారూ?-బైదిబై డైలా గెలావుంది?" అన్నాడు రాజు బాధగా.

"హోరినీ యిల్లు బంగారంగానూ. ఇందాకట్నించీ నా మాటలువిని నేనే ఎడిటర్ననుకున్నావా? ధంపెళావు. వారు వేరు. ఇపుడే వస్తారు. నేను ఉత్త ఫ్రెండుని. ఊరికినే వచ్చానన్నమాట. ఇంకా నయం ముందరే చెప్పావు. నేను ఒక ప్రొడ్యూసర్ బ్రదరిల్లాని. ఇంకో ఎగిబిటర్ మేనల్లుడిని... వెరి పవర్ ఫుల్ మాన్ని. ఏ మనుకున్నావో. —పోతే డైలాగు బ్రిలియంట్ గా లేదు." అన్నాడు కొలంబస్.

"అయ్యో బాబోయ్! నిజంగానే?... అయామె యంగ్ మెన్ సార్. అయివాంటు జాయింటు ఫిలింఫీల్డ్...అయామె హీరో ఫర్ సిక్స్ డ్రామాస్..."

"హోల్డాన్. తెలుగులో కంటిన్యూ చెయ్యి. అదర్ వైస్ సమ్ రీడర్స్ విల్ వాట్ అండర్ స్టాండ్యూ" అన్నాడు కొలంబస్.

"రైకో సార్. నేను చలనచిత్రములలో చేర నభిలషించుచున్న ఆంధ్ర యువకుడిని. ప్రతిభా వంతుడిని. బోల్డు ఉత్సాహం ఉంది."

"వెరిగుడ్. ఉత్సాహంకాక ఇంకేమిటి ఉన్నాయి.?"

"ఆశయాలూ ఆదర్శాలూ, ఓ రేకుపెట్టె, ఎం. శ్రీరాములు యండ్ బ్రదరువారి పంచీ, (మా వద్ద యక్సర్ సైజు బుక్కులు, ఎక్కములుబుక్కులు, పెన్సిళ్లు, రబ్బర్లు, సకలాంధ్రవాచక పుస్తకములు మేలైన డిటెక్టివు నవలలు మొదలగునవి సరసమైన ధరలకు దొరకబడును ఇట్లు-) ఉన్నాయండి. పంచిలో ఓ చొక్కాలాగు, కొంచెం లిప్టేచరు ఉందండి."

"వెరీగుడ్. పెట్టెలో ఏ ముంది."

"పెట్టెలో నాండి...పెట్టెలో నవల్సులూ, స్క్రీన్ ప్లేలూ, సినిమా సాంగ్సులూ అవీ ఉన్నాయండి" అన్నాడు రాజు బోల్డు సిగ్గుపడిపోతూ.

'ఎన్నిరీళ్లు?' అన్నాడు కొలంబస్ సిగరెట్ ముట్టిస్తూ నిర్లక్ష్యంగా.

రాజుకు కోపం వచ్చింది. 'కళని రీళ్లల్లో కూచే నిష్కాగు లనుకో లేదు; మీరు.'

అన్నాడు గంభీరంగా ఇంటి పైకప్పువంక చూస్తూ.

"బాగుంది బ్రదర్. ఒక్క పెట్టే అన్నావు కాబట్టి వీశెలన్నాను. నాసొమ్మేం పోయె. మణుగులనమంటే అలా గేఅంటాను. పుటు అనమన్నా నాకు అభ్యంతరం లేదు. అవేవో పండుములు, గరిసెలు, ఇంకా తులాలూ ఫలాలూ, ఏబులాలూ, పేలాలూ, అమృత్ లాలూ ఇలా ఏ లెక్కన తూయించ డానికీ కూడా నేను పేచీపెట్టను"అన్నాడు.

'అసలు కళని ఎవరేనా తూస్తారేవిటండి.'

'లేకపోతే డబ్బు లెలా గిడతాయి. అమ్ముకోవూ?'

"బాగుంది సార్. అలా అమ్ముకునే టయితే అంతకష్టపడి రాయటం ఎందుకు?"

"ఎందు కేవిటి. తెల్లకాయితాలు అమ్మాలంటే కష్టంకదా? గవర్నమెంటువాళ్ళు ముందర లైసెన్సు అదీ పుచ్చుకోమంటారు. వాటిమీద ఏదోఓటి రాసిపడేసే ■ బెడద లుండవు. అదృష్టంవుంటే ఏకహీడా రెహమాన్తో చదువుతుంది. ఆనక నీమీద 'ప్యాసా' తియ్యొచ్చు."

రాజుకి బోధపడలేదు. అందుకని తనకు తెలిసిన పద్ధతిలోనే చెప్పదలచినది చెప్ప డానికి ఉపక్రమించాడు. ఇపుడు ఇవన్నీ చెప్పకపోతే, ఆనక "చేజారినపిట్ట చిక్కి పోయెనే" అని డైలాగు అనుకుంటూ క్లోజప్‌లో విచారపడాల్సొస్తుందని అతనికి తెలుసు.

అందుకని పుంజుకుని, 'నావద్ద సినిమాకి మొత్తం నాలుగొందల యాభై సజ్జెట్లు రెడీగా ఉన్నాయి సార్. చూడరాదా?" అన్నాడు ఆశగా, నూటిగా.

"అయ్య బాబోయ్. అయితే నువ్వే రైటు. వీశెల్లో తూచలేం; అడుగుల్లో కొలవలేం. ఉజ్జాయింపుని వీశెడు కథ మూడుమైళ్ళు పొడుగుంటుందిగద. ఆలెక్కన నీదగిర ఓ పదిపుట్ల కథలుంటే ఎన్నిమైళ్ళు? చెప్పు. ఖమాన్. వీశకి మూడు మైళ్ళు. పుట్టికెన్ని?...ముందర పుట్టికెన్ని వీశెలో చెప్పు...ఊఁ. చెప్పవేం? పుట్టకెన్నిమైళ్ళు. మైలుకెన్ని వీశెలు, వీశకెన్ని గంటలు? ఇవికూడా తెలీపోతే యువార్ అన్‌ఫిట్..." అన్నాడు కొలంబస్.

'సారీ సార్. తెలీదండి.'

'హుఁ...ఇలాంటివాళ్ళంతా రైటర్లవుతున్నారు...బ్రదర్. ఓటే కొండగుర్తు. ఈ ప్రపంచకంలో నీకు తెలీంచేది లేదు. నీకు తెలీందేమైనా ఉందేమో ఒకవేళ ఆ సంగతి నీకుతెలీదేమో అని ఎవడేనా అంటే, అదీ తెలుసని వాదించు. ఝామ్మని దబాయించు' అన్నాడు కొలంబస్.

సజ్జెట్లు చూస్తారాండి? ... అన్నాడు రాజు ఆయన ఉపన్యాసం కానిచ్చి.

'ఏమి సజ్జెట్లోయ్! సజ్జెట్లా పెసరట్లూను. పుట్లకొద్దీ ఉంటే నేనెక్కడ చూడను. టైములేద్...నో టైము!

"ఇందాకళనే చెబుతూ ఉంటే, మీరు అంతా వినలేదండి. ఆ నాలుగొందల యాభయీ నేనింకా రాయలేనివండి. రాయాలి. ఊరికినే హెడ్డింగులు రాశానన్న మాట. వింటారా? అంటూనే, గబగబ పక్క గదిలోకెళ్ళి ఓమూల ఉన్న తన పెట్టెతీసి చూసి, అయ్యోబాబోయ్! అని పరుగెత్తు కొచ్చాడు రాజు.

"పెద్దపోకరాండి, నా పెట్టె ఎవడో కొట్టేసి వాడిదినాకు తోసేశాడండి రైల్లో. మర్చిపోయాను. ఇప్పుడెలాగ? నాలిట్రేచరు...!

"నీ లిట్రేచరుపోతే మరేం ఫరవాలేదురే ఆ కొత్తపెట్టిలో ఏముందో చూడు. అందులో నైనా కొన్ని పనికొచ్చే కాయితం ముక్క లుండచ్చు...నోట్లు లాటివి."

"ఏంలేవండి. సుమారు రెండు వీశె న్యూసు పేపర్లు, రెండు కాళీసిసాలు ఉన్నా యండి. బెంగుళూరు బొంబాయి, కలకత్తా, ఢిల్లీలలో పాత పేపర్లు వీసె ఎలాగో వే రాసిన అట్ట ఓటి ఉందండి...అయితేనే ఫరవాలేదు. నాలిట్రేచరు నాకు కంఠతా వే చెప్పవాండి?"

"ఉ కానీ. ఏంచేస్తాం నీదయ."అన్నాడు కొలంబస్.

"శుక్లాంబరధరం విష్ణుం" చదువుకు పుంజుకున్నాడు రాజు రాబోయే చిత్రా జాబితా: "అతుకుల బ్రతుకులు, బతుకు అతుకులు, గతుకుల బతుకులు, బతుకుల గతుకులు, శిథిలగృహం, శ్మశానవాటి

## విక్రమార్కుడి మార్కు సింహాసనం

సుందరి ఎ. మ్మే. బన్‌రొట్టి, వాన్‌రొట్టి, (ఈ రెండూ క్యామిడీ స్లెండి) బావా మరదళ్ళు, వానా వడగళ్ళు, జోడెడ్ల బళ్ళు, ఆశ, (మూడక్షరాలవి, లక్కీ పేర్లు చెప్పవాండి?) నిరాశ, దురాశ, పేరాశ, ఖులాసా దిలాసా, (ఈ రెండూ హ్యూమరికల్) పలాసా, మసాలా (ఇవి స్పైటికల్ వి) లలాలా (మ్యూజికల్) సీత, లీల, బాల, గోల, రాధ, బాధ, బరి, శిబరి, కబరి, అంబారి, లంబాడి, (ఇక్కణ్ణించి నాలుగు వండి) మామవయ్యా, మీ అత్తయ్యా, శేషశాయి, హాయిహాయి, ఇరుగిల్లు, పొరుగిల్లు, గల్లుగల్లు, దుర్యోధడు, దుర్మార్గుడు, దుర్మార్గుడు, ధర్మరాజు, బెజవాడా, మెడ్రాస్, గుడివాడ జంక్షన్, (ఇది డిటెక్టివు పిక్చర్‌కి హెడ్డింగులనుకోండి... మీ దయ అన్నాడు కొలంబస్) తరవాత, కాంచనమాల, యాటంబాంబ్, శిలీముఖం, సగం సగం, నువ్వూ నేనూ—"

"ఆట్టే అట్టే హోల్డాన్...శిలీముఖం అంటే ఏమిటి బ్రదర్?" అని అడ్డుతగిలాడు కొలంబస్.

రాజు అరక్షణం ఆగాడు. 'తెలీదండి' ఏదోఓటి. మన కెందుకు పోనిస్తురూ, ఏం...సోషల్స్...సుధా మధూ, నిర్మలా మోహన్—

"ఆగవయ్యాంటే ... శిలీముఖం సంగతి చెప్పవేం? అర్థం చెప్పూ."

'హెడ్డింగులికి అర్థం ఏమిటి సార్ నాబొంద...కథకి కాళ్ళూ చేతులా అన్నట్టు దీనికి అర్థమాపర్థమా...క్యాచీగా ఉండాలి అంతే.'

'మీబొంద...వెతికితే అర్థంపర్థం అన్నీ ఉంటాయి. శిలీమొహం అంటే...శిలి అనే వాడి ముహం అన్నమాట. బాగా దానాలూ అవీ చేశారు. వీడూ, దధీచి అనే ఇంకోడూ అసలు వారిద్దర్ని జాయింటు పోరీ. నువ్వు విడదియ్యడం బాగానే ఉందనుకో. రెండు పిక్చర్లకి పనికొస్తుంది. ఏం? ఆ శిలి అనేవాడి ముహంతో ఓ స్టాట్యూటు కట్టారు. దానికధ అన్నమాట. తెలిసిందా?"

'తెలిసింది కానండి. తప్పేమోనండి. మీరు చెప్పినవాడిపేరు శిబి అనుకుంటా!'

'లాభం లేదు. మోస్ అన్‌ఫిట్. అర్థణాకి చెల్లవు. ఎప్పుడూ అలా నీకంటే పెద్దవాళ్ళ మాట రైటు కాదేమో అనకు. రైటో అనడమే. పెద్దవాళ్లు సిలి అంటే సిలే. శిబిఅంటే శిలే. అయినా శిబేమిటి నాబొందలా ఉంది. సిలే అయ్యుంటుంది వాడిపేరు.

నీ హెడ్డింగులు వింటే ఓటిజ్ఞాపకం

# బైరాగి

[కొత్తరకం జానపదగేయం]

చెప్పేమూక్తుల చెవినిడునరుడా—
రామగురుడా సీతారాం
తప్పదు గురునీ వాక్యంతథ్యం— ,,
భారతమాతా బిడ్డలందరం— ,,
పేరుగాంచినా పెద్దకుటుంబం— ,,
వీరులు శూరులు వున్నరు సత్యం— ,,
త్యాగులు తపసులు వున్నరు నిత్యం- ,,
అట్టి కుటుంబం యెట్టులుండవలె?— ,,
కులభేదాలూ కూడవు నరుడా— ,,
మతభేదాలూ మంచివిగావూ— ,,
మురాతత్వములు మట్టుబెటరా— ,,
అలసత్వాన్నీ అవల త్రోలరా— ,,
కన్ను విప్పరా కనరాదేశం— ,,
కొత్త వెలుగురా కనరాదేశం— ,,

పంచవర్ష ప్రణాళికతోటి? ,,
పురకలు వేస్తూ వున్నది దేశం— ,,
యిటు చూడుము యివిగో ప్రాజెక్టులు ,,
అటుచూడుము అవిగో ప్రాజెక్టులు— ,,

కొత్తమిల్లులూ కొత్తరోడ్లురా— ,,
అవి యివియంటూ యెన్న నేలరా— ,,
యిన్ని పనులు మరి యిట్టులు వుంటే ,,
వెఱ్రివాదనలు యేలర నరుడా— ,,
చిలిపికయ్యముల సారమేమిరా— ,,
తెలె నరుడా లెమ్మరవేగా— ,,
సోమరితనమును చేరనీకురా— ,,
అభివృద్ధీ ప్రణాళికలకురా— ,,
అండగ నిలిచీ ఆదుకొమ్మురా— ,,
మనదీదేశం మనదే బాధ్యత— ,,
భారతమాతా బిడ్డలందరం— ,,
పేరుగాంచినా పెద్ద కుటుంబం— ,,
చెప్పిన సూక్తుల చెవినిడు నరుడా— ,,

[లక్ష్మీకాంత మోహన్]

వస్తుంది అబ్బాయ్. ఓ కథ చెబుతా విను" అన్నాడు కొలంబస్.

* * *

నువ్వింకా ఉత్తిహెడ్డింగులే రాశావు. మా ఫ్రెండు శేషగిరి కటలిక్కట్టలు కథలు రాశాడు సినిమాలకని...ముఖ్యంగా పౌరాణికాల మీద స్పెషలిస్టు అనమాట. సీతారాముల దగ్గర్నించి సాయిబాబా దాకా ఎంతమంది దేవతలూ రాక్షసులూ ఆడామగా ఉన్నారో అందరికథలూ విడివిడిగాజమిలిగా సమిష్టిగా తయారుచేసి వాటికి ట్రీటుమెంటు రాసి అట్టే పెట్టుంచాడు. ఎవరన్నా ప్రొడ్యూసరు అర్థరాత్రప్పుడు ఓ సబ్జెక్టు కావాలంటే రెడీ ■నేవాడు గిరి. అయితే నేం, ఎవడూ వీడికి కానీయిచ్చిన పాపాన పోలేదు. కథ వీడిదగ్గిర పుచ్చుకోడం చూస్తానడం. చూసి, దాన్ని ఇంకో పెద్దరైటరెవడికో యిచ్చి రాయించుకోడం...గిరిగాడు బోరెత్తి నెత్తి మొత్తుకోడం... నాన్సెన్స్, శూర్పణక కథ వాడిబాబు మొల్లా అని వీళ్ళుతిట్టడం...ఇదీవరస...

ఒకసారి ఈ గిరిగాడు జటాయువు కథ సినిమాకి బెష్టుగా ఉంటుందనుకున్నాడు. అనుకోడ మేమిటి ఇద్దరు ముగ్గురు ప్రొడ్యూసరు ఫ్రెండ్లకి మెల్లిగా ఈ సంగతి చెప్పి, రాత్రి తెల్లవార్లూకూచుని తను కథ రాసిపారేశాడు. జటాయువు కథ తెలుసుగా. వాడి అన్న సంపాతి అని ఓకున్నాడు. ఇద్దరూ ఒకర్తినే ప్రేమించారన్నమాట. వాళ్లనాన్న బీదపక్షి. అంటే ముసలాడు. బలం లేదనమాట. మరి డేగలకి బలమేగదా ఆస్తి. సరే ఆ ముసలాడు ఓచెట్టుకొమ్మమీద కంబళి కప్పుకుని దగ్గుతూ కూర్చుండగా బిగినవుతుందన్నమాట.

డేగలు కంబళీ కప్పుకుంటాయాండి. అన్నాడురాజు జంకుతునే.

"ఎందుకప్పుకోవు. అయితే, చేనేతకంబళ్లు కప్పుకుంటాయి. అలానిడిస్ట్రిబ్యూటరుకూడా చెప్పాడు. ఆనక రైటర్ని అడిగితే, ఆయన రైట్ అని చెప్పాడు. ఒరిజినల్ రామాయణంలో ఓశ్లోకంలో బిట్వీన్‌దిలైన్సు-అంటే రెండు లైన్ల మధ్యన ఉందిట"

'ఏది? చేనేతకంబళీయాండి? అంత పల్లుగా వేసేనారా?" అన్నాడు రాజు ఉత్సాహంతో, ఆశ్చర్యంతో

"నీబొంద. జటాయువులు కంబళ్ళు కప్పుకుంటాయీ అన్న సంగతిఉంది. సరే కథవిను. ■ జటాయు తండ్రి అలా ఇంట్రవెల్ దాకా దగ్గుతూ బతికుంటాడు. ఈలోగా జటాయూ, సంపాతీ, ఆ పిల్ల డేగకోసం పవర్‌ఫుల్ డైలాగుల్లో ఛెడామడా తిట్టుకుంటాయనుకో, అపుడే ఆకాశంలోకి ఎగిరి ఇద్దరూ రెక్కల్తో యుద్ధం చేస్తాయి. రెక్కల యుద్ధం....కనీవినీ ఎరుగని రెండుగండభేరుండాలు నోటిలోకా గడాలు పట్టుకొని రెక్కలలో కొట్టుకొన్నదృత భయానక రౌద్ర దృశ్యాలను చూడుకు—అలాని రాసుకో వచ్చు పోష్టరమీద — ఏం. వాళ్ళు కొట్టుకున్నాక సంపాతికి రెక్కలు తెగిపోతాయి అక్కడ శాడ్ సాంగ్...ఇది చూచి ఆ పిల్ల మనసు విరిగిపోతుంది.

హ్యాట్ లైఫ్! మామూలాన బ్రదర్స్ ఫైట్ చేశారు. తన్ ఫెలాకి రెక్కలు తెగిపోయాయి. పూర్ బర్డ్' అనుకుని ఓ పాట పాడి, బాగా పైకెగిరి రెక్కలు ఆడించడం మానేసి, కిందపడడం మొదలెట్టింది.

■ గండభేరుండి క్రింద పడిందా! పడితే గిడితే బతికి (చేనేత)బట్టకట్టిందా? (ఇక్కడకూడా చేనేత ప్రాపగాండా పెడితే జనాభాని బాగా ఆకర్షించొచ్చు.) జటాయూ వేనా ■మెనిపెళ్ళాడాడా? వాడి రెక్కలు ఏమయ్యాయి? జటాయూ సీతని రక్షిస్తాడా? సీతకి రాముడు కనబడతాడా? వెండి తెర మీద చూడుకు (లేదా వచ్చేవారం పత్రిక చదువుకు.) ★




మరియు హైదరాబాదు.



# నీగ్రో గాయని మేరియన్ ఆండర్సన్





ప్రపంచ ప్రసిద్ధిపొందిన గానకోకిల మేరియన్ ఆండర్సన్



ఈనెల 11 వ మద్రాసులో పాటకచేరీ చేయనున్న అమెరికన్ గాయని మేరియన్ ఆండర్సన్

“మీ కంఠంలాంటి కంఠం ఏ నూరేళ్ళకో ఒకసారి వినిపిస్తుంది,” అని ప్రసిద్ధ వాద్యబృంద నిర్వాహకుడు ఆర్టూరో టాస్కానినీ ఆమెను ప్రశంసించాడు.

“మా యింటికప్పు మీ కంఠానికి తగినంత ఎత్తులేదు” అని ఫిన్లెండులో సంగీతకర్త జాన్ సిబిలియస్ ఆమెను కీర్తించాడు

మాస్కోలో ప్రముఖ గాయకుడు స్టానిస్లావ్‌స్కీ ఆనందం పట్టలేక అది వడి శీతకాలమైనా ఎక్కణ్ణించో తెల్ల కలువలు సంపాయించుకునివచ్చి ఆమెకు బహూకరించాడు

1939 లో లింకన్ స్మారకభవన సోపానాలమీద, ఆమె కచేరీ చేసినప్పుడు ఎదురుగా మైదానంలో 75 వేలమంది శ్రోతలు కూర్చుని విని తన్మయులయ్యారు.

ఈ ఏడాది ఐసెన్‌హోవర్ రెండవసారి అధ్యక్షపదవిని స్వీకరిస్తున్న ఉత్సవ సమయంలో ఆమె ప్రత్యేకంగా ఆహూతురాలై అమెరికన్ జాతీయగీతం గానంచేసింది.

ఇంకా ఎన్నో ఇటువంటి అద్భుత గౌరవాలు, సన్మానాలు, డిగ్రీలు, బహుమతులు పొందిన ఆ గాయని పేరు మేరియన్ ఆండర్సన్. ఫిలడెల్ఫియాలోని నీగ్రో పేటలో ఒక పేద కుటుంబంలో జన్మించి అంచెలంచెలుగా విజయశిఖరం ఆరోహించి ఈమె ఈనాడు ప్రపంచంలోనే అగ్రశ్రేణి గాయని అనిపించుకున్నది.

ఆరవ ఏటనే ఈమె సంగీత జీవితం ప్రారంభమైంది. ఎనిమిదోఏట ఆమె పాట పాడి మొదటిసారిగా అర్థ డాలర్ సంపాయించింది. ఆరోజున ఒక ఫిలడెల్ఫియా గాయకుడు ఆమె తల్లితో “ఈ పిల్ల ఒకరోజున కచేరీకి 50 డాలర్లు సంపాయించగలదు” అని జోస్యంచెప్పాడట. ఈ జోస్యం హాస్యమైంది. ఎందుకంటే మేరియన్ ఆండర్సన్ ఒక్కొక్కసారి ఒక్కొక్క పాటకచేరీకి కొన్ని వేల డాలర్లు ఆర్జించింది అయితే అంత విజయం సాధించడానికి ఆమె ఎదుర్కోవలసి వచ్చిన కష్టాలు ఇన్నీ అన్నీ కావు. ఈమెకు మొదటగా యూరప్‌లో బ్రహ్మాండమైన విజయం లభించింది, ఎన్నో సార్లు యూరపియన్ నగరాల్లో కచేరీలుచేసి ప్రభుత్వాలనుండి, ప్రజా సంస్థలనుండీ, బహుమతులు, సత్కారాలు పొందింది. జపాన్ చక్రవర్తి ఈమెకు “యుకోషా” బహుమతి ఇచ్చాడు. లైబీరియా ప్రభుత్వం ‘ఆఫ్రికన్ రిడెంప్షన్” పతకం బహూకరించింది. ఇంకా యూరప్‌లోను, అమెరికాలోను ఇలాంటి బహుమతులెన్నో ఆమెకు లభించాయి.

(56-వ పేజీ చూడండి)

# విష్ణుకుండినుల నాణెములు

క్రీస్తుశకం మూడవ శతాబ్ద ప్రారంభంనాటికి శాతవాహనుల పరిపాలన అంతరించగానే సువిశాల ఆంధ్ర సామ్రాజ్యం ఛిన్నా భిన్నమైపోయింది. 'ఆభీరులు,' 'చూటులు,' 'ఇక్ష్వాకులు,' 'పల్లవులు' మొదలైనవారు చిన్న చిన్న రాజ్యాలను స్థాపించుకున్నారు. సముద్రగుప్తుడు దక్షిణ దేశం మీదికి దండెత్తి వచ్చినపుడు ఆంధ్రదేశంలో వేంగిని రాజధానిగా చేసుకుని పాలిస్తున్నవారు "శాలంకాయనులు." ఈశాలంకాయనుల తరవాత "విష్ణుకుండినులు" వేంగీ ప్రాంతానికి అధీనులయ్యారు. (వేంగీపట్టణాన్ని ఏలూరు వద్దనున్న నేటి "పెదవేగి'తో పోల్చవచ్చును.)

విష్ణుకుండినుల పరిపాలన క్రీ. శ. 420 మొదలు 620 వరకు అవిచ్ఛిన్నంగా సాగిందని చెప్పవచ్చు. వీరి రాజధాని "లెందులూరు" లేక "దెందులూరు". కాని, ఈ విషయం వివాదగ్రస్తమైనది. ఆధునికాంధ్ర చరిత్రకారులలో "కొండవీడు" అని కొందరు "వినుకొండ" అని కొందరు భావిస్తున్నారు. ఈ రాజులవంశక్రమాన్ని గూర్చికూడా చరిత్రకారులలో ఏకాభిప్రాయం లేదు. క్రీ. శ. 440-460 వరకు పాలించిన "మాధవవర్మ" అనే రాజు పదకొండు 'అశ్వమేధయాగాలు' చేసినట్లు తెలుస్తోంది. ఈ రాజులలో కొందరికి "విక్రమాశ్రయ" "జనాశ్రయ" అనే బిరుదులుండేవి. వీరి కులదైవము 'శ్రీ పర్వతస్వామి'. బెజవాడ, మొగల్రాజపురం, ఉండవల్లి, భైరవకొండ మొదలైన ప్రాంతాల్లో పర్వతాల్లో తొలిచిన దేవాలయాలు, శిల్పాలు, విష్ణుకుండినులవే అని శ్రీ డూబ్రేయిల్ మహాశయుని అభిప్రాయము.

సర్ వాల్టర్ ఇలియట్ అనే ఆంగ్లేయుడు ఉత్తరసర్కార్లలో కమీషనర్ గా పనిచేసే కాలంలో కొన్ని నాణెములను సేకరించాడు. ఆ నాణెములు తమిళరాజులైన పల్లవులకు చెందినవని విన్సెంట్ స్మిత్, ప్రొఫెసర్ రాప్సన్ మొదలైన చరిత్రకారులు తప్పుడుగా సిద్ధాంతీకరించి ఆంధ్రులకు అన్యాయం చేశారు. ఈ నాణెములన్నీ ఆంధ్రరాజులైన విష్ణుకుండినులకు చెందినవని నిస్సందేహంగా చెప్పవచ్చు. స్మిత్, రాప్సన్లు ఈవిధమైన తప్పుడు నిర్ణయంచేసిన కాలానికి, విష్ణుకుండినులనే రాజవంశం ఆంధ్రదేశాన్ని పాలించినదనే విషయం చరిత్రకారులకు తెలియదు. నేడు విష్ణుకుండినులను గురించి చరిత్రాంశము లనేకం బయటపడ్డాయి గనుక, చరిత్రకారులు సముచిత నిర్ణయం చేయవలసివుంది. అదిగాక, ఈ నాణెములన్నీ ఉత్తర సర్కారుల్లోనే లభించాయి. అందుచేత

**"తంగిరాల"**

అవి ఆంధ్రదేశ ఉత్తరప్రాంతాన్ని పాలించిన రాజవంశాలకు (విష్ణుకుండినులకు) మాత్రమే చెందివుంటాయనే విషయం నిస్సంశయము.

ప్రొఫెసర్ రాప్సన్ ఆ నాణెములు పల్లవులకు చెందినవని పేర్కొని, వాటిని రెండువిధాలుగా విభజించాడు. కొన్ని నాణెములు లిపిలో ఆంధ్రనాణెములను పోలివున్నాయి. అవి "పల్లవ పురంబుల"కే వారికి చెందినవనీ, అవి 2, 3 శతాబ్దాలకు చెందివుంటాయనీ, ఈ నాణెములమీద ఓడబొమ్మలుండడంచేత వాటిని ముద్రించిన రాజవంశము విదేశాలతో నౌకావ్యాపారం విరివిగా సాగించివుంటుందని రాప్సన్ భావించాడు. కాని పల్లవులు మూడవశతాబ్ది మధ్యకాలంలోగాని దక్షిణదేశంలో ప్రబలులు కాలేదు. అంతవరకు ఆంధ్రదేశాన్ని శాతవాహన చక్రవర్తులు, వారి తరువాత ఇక్ష్వాకులు పాలించారు. నాగార్జున కొండవద్ద "బోధిసిరి" ప్రాకృతశాసనం ఒకటి లభించింది. ఇక్ష్వాకులకాలంలో ఆంధ్రదేశం సముద్రాలకావలనున్న తూర్పుదేశాలతో మత సంబంధాన్ని, వాణిజ్య సంబంధాన్ని కలిగిఉండినట్లు ఈ శాసనాన్నిబట్టి తెలుస్తోంది. ఆంధ్ర శాతవాహన చక్రవర్తియైన "యజ్ఞశ్రీ శాతకర్ణి" నాణెములమీదసహితము ఓడబొమ్మలున్న విషయం మనకు సువిదితమే. శాతవాహనుల కాలంలో విదేశవాణిజ్యం



జాడీల పరిశ్రమ — భీమడోలు

—ఫోటో: ద్రోణంరాజు నాగేశ్వరరావు భీమవరము.

# ★ విష్ణుకుండినుల నాణెములు ★

సర్వతోముఖంగా అభివృద్ధి చెందినవిషయం కూడా మనకు తెలిసిందే. కాబట్టి సర్ వాల్టర్ ఇలియట్ సేకరించిన నాకౌముద్రలున్న నాణెములు ఇక్ష్వాకులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు మొదలగు ఆంధ్రరాజులకు చెందినవి కాని, పల్లవులకు చెందినవి మాత్రం కాదు.

ప్రొఫెసర్ రాప్సన్ చేసిన రెండవ విభాగం : బంగారు నాణెములు; వెండినాణెములు. వీటిమీదకూడా అవి ఏకాలానికి చెందినవో తెలిపే నిదర్శనాలేమీ లేవు. ఈ నాణెముల మీద ఒక వైపున జూలున్న సింహం బొమ్మలున్నాయి. (మగ సింహానికి మాత్రమే జూలుంటుంది, ఆడసింహానికి జూలు ఉండదు.) కేసరి లాంఛనమున్న ప్రాచీనాంధ్ర రాజవంశాలు ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు మాత్రమే. పల్లవుల కీవిధమైన లాంఛనంలేదు. వారిగుర్తు 'నంది'. రామతీర్థం చిక్కుళ్ళ శాసనాలమీదను, మాధవవర్మకు చెందిన పొనమూరు శాసనం మీదను సింగపు బొమ్మలున్న సీళ్ళున్నాయి. ఆసింహం ముందు కాళ్ళలోని కుడిపంజా పైకి ఎత్తి, నోరు విశాలంగా తెరిచి, తోక ఉవ్వెత్తుగా పైకి లేపి ఉన్నట్టు ముద్రితమైంది.

ఇక్ష్వాకుల కాలంలోను, విష్ణుకుండినుల కాలంలోను ఈ విధమైన కేసరి ముద్రలున్న శాసనాలు ప్రఖ్యాతము. కాబట్టి ఈ కేసరి ముద్రలున్నవి పల్లవులకు చెందినవి కావు.

ఈ సింహం గుర్తులున్న నాణెములకు రెండవ ప్రక్క ఒక బల్లమీద చక్కటి పూలకుండి పెటిన బొమ్మఉంది. ఈ విచిత్రమైన పూలకుండీ గుర్తులు బెజవాడ, ఉండవల్లి, మొగలురాజపురములలోని కొండలలో తొలువబడిన దేవాలయాల్లోను, శిల్పాల్లోను ముఖ్యంగా కనబడుతున్నాయి. కృష్ణానదికి ఉత్తరానవున్న ఈ ప్రాంతాన్ని పల్లవులు ఏన్నడూ పరిపాలించి వుండలేదు. అందుచేత, సింగపు గుర్తులు, పూలకుండీ గుర్తులు ఉన్న ఈ నాణెములన్నీ ఆంధ్ర రాజవంశాలకు, ముఖ్యంగా విష్ణుకుండినులకు చెందినవే.

సర్ వాల్టర్ ఇలియట్ తనకు లభించిన నాణెములు ఆరు రకములని తెలిపాడు. వాటిలో రెండు తక్కువరకపు వెండితో చేసినవి. మిగిలినవి పలురకాల బహువులు తూగే బంగారంతో చేసినవి. వెండి నాణెముల మీద ఒక వైపున అమితంగా జూలువున్న సింహపు బొమ్మ, దానికింద కొంత లిపి; రెండవ వైపున ఎత్తైన ముక్కాలి పీట మీద ఉంచిన చక్కని పూలకుండీ ఉన్నాయి. ఆ సింహం ముద్రకి పైనగాని, ముందుగాని ఒక కత్తిబొమ్మ ఉన్న నాణెములు కూడా కొన్ని ఉన్నాయని ఇలియట్ తెలియజేశాడు. బంగారునాణెముల మీద కూడా ఒకవైపున పంజాఎత్తిన సింహం ముద్ర, రెండవవైపున ఒక అంతస్థుభవనపు చిత్రం ఉన్నాయి. ఈ సౌధం గుర్తుగమనింపదగ్గది. ఈ గుర్తు కృష్ణా తీరాన ఉండవల్లి వద్ద అంతస్థులలో వున్న శిలా దేవాలయాన్ని సూచిస్తుంది. ఈ భవనానికి క్రింద స్తంభాలున్నట్టు కూడా కనబడుతుంది. ఇంతే కాకుండా రాజసుహేంద్రవరంలో లభించిన ఒక సువర్ణ నాణెంమీద ఒక వైపున పంజా ఎత్తిన కేసరి ముద్ర, దాని క్రింద "మా" అనే అక్షరం ఉన్నాయి. మరొక అక్షరం సరిగా తెలియడం లేదు; బహుశా "ధ" అయివుంటుందని చరిత్రకారులూహించారు. ఈ రెండు అక్షరాలు విష్ణుకుండినుల రాజైన "మాధవ వర్మ" పేరును తెలుపుతున్నాయని నమ్మవచ్చు. కాబట్టి ఈ నాణెములన్నీ విష్ణుకుండినులకే చెందినవి కాని పల్లవులవి అయి వుండవు.

అనకాపల్లిలోని "బొజ్జన్న కొండ", "ఏటికొండ" ప్రాంతాల్లో 68 రాగి నాణెములు, ఒక బంగారు నాణెం లభించాయి. వీనిలో కొన్ని రాగి నాణెముల మీద 'విషమసిద్ధి' కథ సూచింపబడింది. ఈ విషమసిద్ధి చాళుక్యరాజగు 'కుబ్జవిష్ణువర్ధనుడు'. మిగిలిన నాణెముల మీద సింహం, పూలకుండీ బొమ్మలున్నాయి. ఈ నాణెములన్నీ పల్లవులకు చెందినవని అసమంజసంగా సిద్ధాంతీకరించారు.

విష్ణుకుండినుల తర్వాత ఆంధ్ర దేశాన్ని పాలించినవారు చాళుక్యులు. ఈ నాణెములపై విషమసిద్ధి కథను సూచించడం విశేషం. కాబట్టి ఈ నాణెములు విష్ణుకుండినులవే. వీరిలో ఒకనాణెం ప్రత్యేకతను కనబరుస్తున్నది. ఈ నాణెం సింహం, పూలకుండీ చిత్రాలనే కాక, 4, 5 శతాబ్దాలకు చెందిన ఒక ప్రాచీనమైన పేరును కూడా కలిగి వుంది. ఒకరు ఈ పేరును చదివి "శ్రీకాంత" అని తెలియజేశారు, కాని, మరొకరు దీన్ని "శ్రీ పర్వత" అని గుర్తించారు. విష్ణుకుండిన రాజులందరూ తాము "శ్రీ పర్వత స్వామి పాదారవిందములను సేవించే వారము" ని చెప్పుకున్నారు. బహుశా, ప్రాచీన విష్ణుకుండిన చక్రవర్తులు తమ కులదైవమగు శ్రీ పర్వత స్వామి

పేరుతో కూడా నాణెములను ముద్రించి వుండవచ్చు.

విష్ణుకుండినులు పాలించిన ప్రదేశాల్లో ఈ నాణెములు లభించడంచేత వానిమీద సింహం, పూలకుండి, అంతస్థులు కలిగిన సౌధం మొదలైన గుర్తులుండడంచేతా, దక్షిణాపథంలో తమకు గల ప్రతిభను వెల్లడించడానికి ఆచక్రవర్తులు తమ నాణెములను రాగి, వెండి, బంగారు లోహములతో ఆయా గుర్తులతో ముద్రించారని చెప్ప వచ్చును. మొదటి మాధవవర్మ పదకొండు అశ్వమేధ యాగాలు, ఒక రాజసూయ యాగము, సర్వమేధము, ఇతరములైన వేలకొలది మహత్తర క్రతువులు చేసినవాడు. మూడవ మాధవవర్మ లెక్కలేనన్ని సువర్ణదానాలు, హిరణ్య గర్భ దానములు చేశాడు. ఈ విధమైన దానములు, క్రతువులు చేసిన విష్ణుకుండిన చక్రవర్తులకు శాసనాలు వ్రాయించవలసిన ఆవశ్యకత, నాణెములను ముద్రించవలసిన అవసరం ఎంతైనావుంది. వారికి పూర్వం పాలించిన ఇక్ష్వాకులు, శాత వాహనుల వలెనే విష్ణుకుండినులు సకలైశ్వర్యములతో తులదూగి, పేరు ప్రఖ్యాతులు గడించిన చక్రవర్తులు. నాణెములు ముద్రించడంలోను, శాసనాలు వ్రాయించడంలోను వారి సమకాలికులైన వాకాటకులు, గుప్త చక్రవర్తులు మొదలైన ఆర్యావర్త రాజులను అనుకరించారు.

విష్ణుకుండినుల దానశాసనాల్లో కూడా సింగపు గురుతులున్నాయి. కేసరి ముద్ర వారి లాంఛనము-విష్ణుకుండినులు వారి పూర్వులైన ఇక్ష్వాకులలోను, శాత వాహనులతోను కొంత సంబంధాన్ని కలిగిఉన్నట్టు తెలుస్తోంది. కాబట్టి 'పూలకుండీ' గుర్తును శాత వాహనులనుండి కాని, ఇక్ష్వాకుల నుండిగాని వీరు అనుకరించి వుండవచ్చు. విష్ణుకుండినులు ఉచ్ఛస్థితిలో నున్నప్పుడు ఉండవల్లి వద్ద పర్వతాన్ని తొలిపించి, మహత్తర దేవాలయాన్ని నిర్మింపజేసి వుంటారు దానిజ్ఞాపకార్థం, నాణెములమీద కూడా దాని పోలికలో ఒక భవనపు ముద్రను చెక్కించి ఉంటారు. కాబట్టి పల్లవరాజులకు చెందినవని తప్పుడుగా చెప్పే ఆరాగినాణెములు, వెండి నాణెములు, సువర్ణ నాణెములు, ఉండవల్లి, మొగల్ రాజపురం, బెజవాడ మొదలగు ప్రదేశములలోని మహత్తర శిల్పాలు, దేవాలయాలు—ఇవన్ని వేంగిని రాజధానిగా చేసుకుని ఆంధ్రదేశాన్ని పాలించిన విష్ణుకుండిన చక్రవర్తులకు చెందినవే. ఇది దాచేస్తే దాగని సత్యం.

[ఎర్లీ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ్
అనే గ్రంథం ఆధారంగా]



# పద్మిని ఇలా చెప్పుచున్నది.

“నేను ఎల్లప్పుడూ లక్స్ టాయిలెట్ సబ్బును వాడు చున్నాను —
అది ఎంతో సంపూర్ణమైన తెల్లనిది, శుద్ధమైనది !”



పద్మిని, అధికంగా పనిచేయుచున్న తార, లక్స్ టాయిలెట్ సబ్బును రోజూ వాడుతూ తన సౌందర్యమును కాపాడుకొనుటను ఆశ్చర్యపడువరు — “దాని తెలుపు, శుద్ధత చర్మమును మృదువుగాను, నునుపుగాను ఉంచు చున్నవి.” అని ఆమె చెప్పుచున్నది.

పరిమళమైన, శ్వేతమగు, లక్స్ టాయిలెట్ సబ్బును మీరే వాడి చూడండి — త్వరలో, మీరు కూడ దాని తెలుపు శుద్ధతయందు ఆధారపడుదురు.

## లక్స్ టాయిలెట్ సబ్బు




సినీమా తారలకు
సౌందర్యమునిచ్చు సబ్బు

L. T. 543-X52 TL

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి వారి తయారు.

# రావు రాబడి

“అస్తమానూ ఏవో వెధవరాతలు రాస్తూ యెందుకూ పనికిరాని పుస్తకాలు పట్టుకు యేడవకపోతే – కాలేజీ పుస్తకాలేమైనా చదవకూడదూ?” తన స్టడీరూమ్‌లో కూర్చుని యేవో పత్రికలు తిరగేస్తున్న రావుని కేకలేశారు తండ్రి పరంధామయ్యగారు.

రావుకి మన్నాస్తి. తన గొడవే తనది కాని తండ్రికేమీ సమాధానం చెప్పలేదు

“ఈ సెప్టెంబరు ఛాన్సులోనైనా ప్యాసు కాకపోతే, నువ్వెందుకు పనికొస్తావురా ఇంక? ఇప్పటకప్పుడే మూడు ఛాన్సులయేయి! నీతోటివాళ్ళు డాక్టరీలు చదువుతున్నారు!” తిరిగి పరంధామయ్య తన మామూలుపారం చదువుకుపోయాడు

“నాన్నగారూ నా చదువు సంగతి నాకు తెలుసు మీ రస్తమానూ నన్ను సాధించకండి,” రావు విసుగ్గా సమాధానం చెప్పేసి చొక్కా వేసుకొని బయటకు వెళ్ళిపోయాడు

“అప్రాచ్యపు వెధవలు! ఇలాంటి వెధవలు. ఎందుకూ పనికిరారు. ఉదయంనుంచి పడుకోబోయేవరకూ యేవో రాతలు, కూతలే గాని ఒక్కసారి ఆ కాలేజి పుస్తకాలు తియ్యడు! గట్టిగా, చదవ్వేరా అని అంటే ఊళ్ళోకి షికార్లు! ఇలాంటివాళ్ళు చివరకు అడుక్కు తినడానికైనా పనికిరారు.” బయటకు వెళుతున్న రావును చూసి విసుక్కుంటూ అని, సణుక్కుంటూ లోపలికెళ్ళిపోయారు పరంధామయ్యగారు

*  *  *

“బాబూరావుగారున్నారా?” వీధి అరుగు మీద కూర్చున్న పరంధామయ్యగారిని అడిగాడు ఒక వ్యక్తి

“లేడబ్బాయీ! అలా యేదో పనిమీద వెళ్ళాడు,” అంటూ ఆ వచ్చిన వ్యక్తికేసి ఆశ్చర్యంగా చూశారు పరంధామయ్యగారు.

“యెంతసేపట్లో వస్తారు?”

“యేమో—తెలియదు. ఆఁ అన్నట్టూ నీపేరు రామరాజు కదూ! ఆ కృష్ణా కాఫీ హోటల్ దగ్గర కిళ్ళీపాపు మీదేగా?”

“అవునుసార్.. అబ్బాయిగారితో కొంచం మాట్లాడేపనుండి వచ్చాను అయ్యగారు వచ్చిన తరువాత ఇలా కిళ్ళీకొట్టు కామరాజు వచ్చివెళ్లేడని చెప్పండి,” అని కామరాజు వెళ్ళిపోయాడు.

“ఈ కిళ్ళీకొట్టు కామరాజుకు మా అబ్బాయితో పనేముంది? అదేమిటో చెప్పమంటే నాకెందుకు చెప్పలేదు? ఈ వంకయేదో సిగరట్టు కాతా పెంచేసివుంటాడు!

శ్రావణి

బాకీ వసూలుచేసుకోడం కోసం ఈ కామయ్యవచ్చాడూ అంతే కానీ సంపాదన లేదు కాతాలు పెంచెయ్యడం !”

“అయ్యగారూ! అయ్యగారూ! రావుగారు లేరండీ?”

“ఎవరూ? రామావిలాస్ ప్రొప్రయిటరు గోపాలయ్యరా? ఇదేమిటండీ వేళగాని వేళొచ్చారూ?” పరంధామయ్యగారు ఆశ్చర్యంగా ప్రశ్నించారు.



ఇటీవల రాజమండ్రిలో లలితకళా నికేతన్ వారి ఆధ్వర్యాన జరిగిన నాటక పోటీలలో ఉత్తమ నటుడుగా నిర్ణయింపబడిన శ్యామ్ సుందర్

“రావుగారితో కొంచం మాట్లాడవలసిన విశేషముందండి. వచ్చాక ఇలా గోపాలయ్యరు వచ్చివెళ్లాడని చెప్పండి,” అని గోపాలయ్యరు వెళ్ళిపోయారు.

“ఓరి వీడి సిగదరగా! పెద్దవంటూ నేనుండగా నాతో మాట్లాడవలసిన అవసరం లేదు కాబోలు వీడికి! నాడు లేడనగానే మారుమాట లేకుండా వెళ్ళిపోయాడే!” అనుకున్నారు పరంధామయ్య

“ఏమండీ రసిక్‌లాల్ గారు వీకేమాత్రం పెంచారు మావాడు?” అని అడిగేద్దామనుకున్నాడు రావుకోసం వచ్చిన బట్టల కొట్టు యజమాని లాల్జీని. కాని కొంచం తమాయించుకున్నాడు.

“రావుగారినో సారి పిలిపిస్తారా?” అన్నారు పరంధామయ్యగారితో

రావుగారిని పిలిపించడానికి నేనేమైన ఇంట్లో దాచుకున్నానా? అని లోపలనుకొని, “పనేమిటో చెప్పండి! వచ్చినతరువాత అబ్బాయితో చెప్తాను,” అన్నారు పరంధామయ్య

“అది ఆయనతోనే మాట్లాడాలి సార్. వచ్చి వెళ్ళేనని చెప్పండి,” అని వెళ్ళిపోయాడు.

“ఇవన్నీ తప్పకుండా బాకీలాయిస్తే. కిళ్ళీ కొట్టు, కాఫీహోటల్, బట్టలకొట్టు బాగానే వున్నాయి! కాతాలు పెంచుకుని, కానీ సంపాదన లేకుండా ఇంట్లో యేవో వెధవ పుస్తకాలతో యేడుస్తుంటే ఎవడు తీరుస్తాడు వీడి అబ్బ?... చిల్లిగవ్వ ఇవ్వను. ఈ రోజు కొట్లకి సెలవు గాబోలు. తీరిగా వసూళ్ళకోసం బయలుదేరారు,” అని పళ్ళు కొరుక్కుంటూ లోపలకు వెళ్ళబోతున్న సమయంలో వీధిలో యేదో కారు ఆగి వచ్చింది.

“అదేమిటీ! ఇంద్రమహాల్ సినిమా ప్రొప్రయిటరు కాంతారామే! వీడు కూడా మనింటికే!” ఆశ్చర్యంగా చూస్తున్నాడు పరంధామయ్యగారు

“రావుగారితో కొంచం మాట్లాడాలి”

“వాడలా బయటకు యేదో పనిమీద వెళ్లాడండీ. కూర్చోండి కాస్సేపు. ఈపాటికి

# ★ రావు రాబడి ★

వస్తూనే వుంటాడు," అన్నారు మర్యాదగా పరంధామయ్యగారు.

"రాత్రి కలుసుకుంటానని చెప్పండి," అని కాంతారామ్ సెలవు తీసుకున్నాడు.

"ఇదేదో వింతగా వుందే. జానెడు లేడా సన్నాసి. వీళ్ళందరికీ వాడితో పనేమిటో! ఇదేదో ఈరోజు కనుక్కొని తీరాలి. అడుగో రానే వస్తున్నాడు; అడిగేస్తాను.

"ఆఁ...వీడెవడూ? మా అబ్బాయి అనుకున్నాను. అలాగే వున్నాడు సుమా..."

"ఏ వూరండీ...ఎవరికోసం వచ్చారు?

"మాది ఈవూరేనండీ. జయలక్ష్మీ మెడికల్ హాల్ మాదేనండీ. రావుగార్ని కొంచం చూసిపోదామనీ..."

"వాడికేం రోగాలొచ్చేయి మీదగ్గర మందులు కొనడానికి?...రాత్రి ఎనిమిది గంటలకు రండి అంతా ఒక్కసారి కట్టకట్టుకొని. ఇంట్లోనే వుంటాడు," అంటూ పరంధామయ్యగారు కోపం పట్టలేక తలుపులు బిడాయించుకుని లోపల కెళ్ళిపోయారు.

* * *

స్నేహితులతో కలసి మెయిన్ బజారు లోంచి వస్తున్న రావుని పిల్చాడు వివేకా హోటలు ప్రొప్రయిటరు.

"కొంచం కాఫీ తీసికొని వెళ్ళండిసార్ ఖరవాలేదు," అన్నాడు.

"ఇప్పుడు కాఫీలు సేవించడానికి డబ్బు లెవడిదగ్గరా లేవని తెలియదు కాబోలురా వీడికి?" అన్నాడు ఒక స్నేహితుడు.

"బాగుందిరా డబ్బులిచ్చేలాగుంటేవాడు మనని పిలవడం దేనికిరా?" అన్నాడు రావు.

"ఏంసార్ మామాటే మర్చిపోయారు?" కాఫీ ఫలహారా లిచ్చి ప్రారంభించాడు. ఆ ప్రొప్రయిటరు.

"ఏం మర్చిపోలేదండీ వచ్చే నెలంతా మీపనే" రావు వెంటనే సమాధానం చెప్పాడు.

"అది దాటిపోనియ్యకండి. అందాక ఈ పాతిక రూపాయలు అడ్వాన్సుగావుంచండి" రెండు పది రూపాయల నోట్లు ఒక అయిదు రూపాయలనోటు జేబులో కుక్కాడు ఆ ప్రొప్రయిటరు.

ఇంతలో జైహింద్ కిళ్ళీషాపు నారాయణ రావుకు, స్నేహితులకు డ్రింకులిచ్చి స్పెషల్ కిళ్ళీలుకూడా కట్టించాడు.

"ఎలావుంది నారాయణా మనబిజినెస్?" రావు అడిగాడు.

"బాగానే వుందిసార్ మీ చేతి చలవ! ఈ నాలుగు కిళ్ళీలు ఇంటికి తీసుకెళ్ళండి"

"ఏమిటిరా వీరంతా స్నేహితు లెవ్వ



చిత్రకారుడు కల్యాణప్రసాద్ శర్మ (విజయనగరం) మైసూరు దసరా ఉత్సవాలలో ఏర్పాటైన అఖిలభారత చిత్రకళా ప్రదర్శనంలో వీరు రచించిన "ఆలింగనము" అనే చిత్రానికి ప్రథమ బహుమతి లభించినది.

---

డయ్యేరోయ్ నీకు? ఆ హోటల్ వాడు అడ్వాన్సంటూ పాతిక రూపాయలిచ్చాడు, ఏ షేమో కిళ్ళీ లిచ్చాడూ! ఇదంతా ఏమిటి...?" ఒక స్నేహితుడు ప్రశ్నించాడు.

"ఆఁ. యేమీలేదు. యేదో స్నేహం. రాత్రి ఎనిమిదిగంటలకు ఇంటికిరండి ఇంకా కొంతమంది స్నేహితులొస్తారు చూద్దురు గాని!"

"అదేమిటో చెప్పకూడదూ మాతో?"

"చెబితే కథ చెడింది" స్నేహితులంతా కూడా ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళేరు.

* * *

"ఏంరా అబ్బాయీ నీకు బుద్ధీ జ్ఞానం లేదూ? ఎన్నేళ్ళొచ్చినా ఒకటే తెలివా?"

"ఏమిటినాన్నా అది?" అన్నాడు రావు ఆశ్చర్యంగా.

"ఏమి లేమిటి? నీ ఇష్టంవచ్చినట్లు పద్దులు పెంచేస్తుంటే తీర్చేదారేమీ కనుపించక్కర లేదూ?" అన్నాడు పరంధామయ్య కసిగా.

"నేనేమీ పద్దులు పెంచలేదే!"

"సిగ్గులేకపోతేసరి! ... మళ్ళీ అబద్ధం కూడా ఎందుకూ? ఊళ్ళోవున్న ప్రతివాడూ నీకోసం ఎందుకు వచ్చాడు? పైగా అదేమిటో నీతోనే మాట్లాడాలని ఎందుకన్నారూ?"

"ఓహో...అదా. అంతా వుంది లెండి. కొనుకాని వాళ్ళలో ఏం దెబ్బలాట లేదు కదా?......ఇంకొక గంటపోతే వాళ్ళంతా ఎందుకొచ్చేరో మీకే తెలుస్తుంది," అని, నిర్లక్ష్యంగా నవ్వుకుంటూ తన గదిలోకి వెళ్ళిపోయాడు రావు.

రాత్రి ఎనిమిదింపావయింది. ఒక్కొక్కరే చొప్పున మధ్యాహ్నం వచ్చినజనమంతా వచ్చారు. పైగా కొంతమంది కొత్తవాళ్ళు కూడా వచ్చారు. అందరూ చేరి కచేరీగదిలో నిండిపోయారు. పరంధామయ్యగారూ, రావు స్నేహితులూ పక్కగదిలో కూర్చుని ఆతురతగా అంతా గమనిస్తున్నారు.

"వీరిహోటల్ వాళ్ళు ఎంతమందివచ్చేరు?" రావు ఒకనోటుపుస్తకం తీసుకున్నాడు.

"కాఫీహోటల్ వాళ్ళం నలుగురం. భోజన హోటల్ వారు ముగ్గురు."

"వచ్చే జనవరినుండి ఏప్రిల్ వరకు మీ కాఫీ హోటళ్లు నాలుగూ, ఈ భోజనహోటళ్లూ వరుసవారిగా వస్తాయి. ప్రతిక ఒకటికి 25 రూపాయల చొప్పున ఒక్కొక్కరూ వందరూపాయలివ్వండి."

"సినిమాహాలు ప్రొప్రయిటర్లు ఎంతమం దండీ?"

"ఇద్దరం సార్!"

"ఇద్దరూ చెరోక వందా ఇవ్వండి. రెండు నెలలు మాత్రమే కాంట్రాక్టు."

"మేము కిళ్ళీకొట్టువాళ్ళం పదిమంది వున్నాం సార్. అంతా తలొక పదికంటే ఎక్కువ ఇచ్చుకోలేం సార్."

"మెడికల్ షాపు ఆయన, బట్టలకొట్టు ఆయన చెరోక సంవత్సరం ప్రత్యేకంగా కాంట్రాక్టు రాయించుకు చెరోక వందా చెల్లించారు అడ్వాన్సుగా. అందరకూ అయిన రేట్లప్రకారం తారీకులు నిర్ణయించి తన నోటుపుస్తకంలో రాసుకున్నాడు రావు ఆరోజు రావుగారి రాబడి వెయ్యిరూపాయలు మించిపోయింది! ఇంకా తండ్రికీ స్నేహితులకూ అర్థంకాకుండంలేదు విషయం. పోనీలే ఏదోవిధంగా వెయ్యిరూపాయలొచ్చేయని తృప్తిపడ్డాడు తండ్రి.

స్నేహితులు బలవంతంచేసినా విషయాన్ని గుప్తంగానే వుంచాడు రావు.

"మీరింకా తెలుసుకోలేకపోతే, తెలుసుకోవాలనివుంటే వచ్చే ఆదివారం రండి," అన్నాడు.

* * *

ఆరోజు ఆదివారం స్నేహితులకు రావు యేం చెప్తాడో అని ఆతురతగా చూస్తున్నారు.

ఇంతలో రావు ఒక పాతిక కథలు తెచ్చి వాళ్ళముందర పడేశాడు. వాటిలో అతను

(48-వ పేజీ చూడండి)



'జ్యేష్ఠ'

సాయంకాలమైంది. నీరెండకూడా అప్పుకోసం తెగతిరిగి దొరక్క వెనుతిరిగిన 'ఋణపతి' లా వెలవెలలాడుతోంది. [illegible] వీధి నిశ్శబ్దంగా ఉంది. ఎవరూ బయటకనపడడం లేదు. ఇళ్లలోంచి పొగలు పెంకుల్ని చీల్చుకు వస్తున్నాయి. హోరుమనివీచే గోదావరిగాలికి పక్కవీధిలో ఆడుకుంటున్న పిల్లల కేరింతల ధ్వని అప్పుడప్పుడు ఉపశ్రుతిగా వినవస్తోంది. అయినా [illegible] సాయంసంధ్య ఒక గంభీరమైన ప్రశాంతతో ఋషి ఆశ్రమాన్ని గుర్తు చేస్తోంది.

గణపతిరావు పడకకుర్చీని ఇంట్లోంచి మోసుకొచ్చి, ముందున్న మురుగుకాలవకు వంతెనలా పరిచాడు. ఆ కుర్చీకర్రలు రెండూ సక్రమంగా ఉన్నాయని పరీక్షచేసి ధ్రువపరుచుకుని జాగ్రత్తగా కూర్చున్నాడు. రెండు నిమిషాలు గడిచాక ఒడిలో చూసుకుని లోపలికిపోయి ఆంధ్రపత్రిక తెచ్చుకున్నాడు. అది నూనెడాగులతోనూ, సిరా మరకలతోనూ, చిన్న చిన్న పద్దులతోనూ నిండి చాలా సిగుపడవలసిన దశలో ఉంది. కాని గణపతిరావుకి (అది మూడురోజుల క్రితం పత్రికైనా) అది చాలు. మూడు రోజుల్లో పత్రిక ముదుసలిదైపోదని అతని నమ్మకం. పైగా అతను కొత్తపత్రిక కొని సంపాదించలేడు. పచారీకొట్లో షావుకార్ని బతిమాలి తిరిగిఇచ్చేసే షరతుమీద తెచ్చి చదువుతూ ఉంటాడు.

కూర్చొని చదవడానికి తయారయ్యేక కళ్లజోడు దగ్గరలేదని గణపతిరావుకి గుర్తొచ్చింది. ఒక పొట్టి నిట్టూర్పువిడిచి లోపలికిపోయి కళ్లజోడు తీసుకొచ్చాడు. మళ్లీ జాగ్రత్తగా కుర్చీలోకూర్చున్నాడు. వెంటనే పేపరు ఇంట్లో మరిచిపోయిన కొత్త పార పాటు ఇకిలిస్తూ ఎదురొచ్చింది. ఎందుకంటే గణపతిరావు జాగ్రత్తగా కుర్చీలో కూర్చుని కళ్ళజోరు చేతనైనంత శుభ్రంగా తుడిచి, ధరించి, కుర్చీ అనుకుంటే ఆగుతోందో ఆగదో శాస్త్రీయంగా పరీక్షించి (అనుకోవడమే పరీక్ష) అప్పుడు తాపీగా ఒడిలో పేపరు తీయబోయాడు. ఒడిలో పేపరు లేదు. తన మతిమరుపు చూసేక తనకి మతిమరుపు ఉన్నదని తనకే తెలిసిపోయింది ఉసూరుమంటూ లేచి లోపలి కెళ్లాడు.

ఆ పేపరు ఉండవల్సిన చోటులో లేదు. తను కళ్లజోడు కోసం కొంకెనున్న లాల్చీ దగ్గరకు వెళ్లాడు అప్పుడు అది అక్కడ లేనట్లు. తను అంతకుముందు పంచాంగం చూసి, దానితో పాటు కళ్ళజోడు కూడా అద్దం దువ్వెన్న అమ్మాయి అల్లిక సామానులూ ఉండే ఆలమరలో పైఅరలో ఉంచినట్లు జ్ఞాపకం వచ్చింది. అప్పుడు తను పేపరు బట్టలపెట్టెమీద ఉంచి వెళ్ళి ఉండాలి బట్టల పెట్టెమీద కాకపోయినా అది ఆగదిలోనే ఉంచి ఉండాలి తను. కాని అది ఆ గదిలో లేదు.

గణపతిరావుకి ఏమీపాలుపోలేదు. అతని తలలో మెదడుకిమారుగా ఏదో ఆముదం లాంటి వస్తువు నిండివున్నట్లనిపించింది. అతనికి [illegible] భయంవేసింది ఆ మతిమరుపుచూస్తే, తను నడుస్తూ నిద్రపోవడంలేదుకదా! తను ఆ నిద్రలో ఆ పేపరు ఎక్కడే నా ఉంచాడో, లేక ఇప్పుడే నిద్రపోతూ పేపరు కనపడలేదని కలలో వెతుకుతున్నాడో!

ఏదీ తేల్చుకోకుండానే, వంటఇంట్లోకి చూశాడు. అక్కడి మసకచీకటిలో నీలాకాశంమీద పాలపుంతలా కనపడింది. తన అమూల్యమైన, మూడురోజులు వయస్సు గల, షావుకారుకి తిరిగి ఇచ్చివేయవలసిన దినపత్రిక. అతను విసురుగా వెళ్ళి దాన్ని పైకి తీసి, ఆత్రంగా కిటికీ వెలుగులోఉంచి కొత్త డాగులేమైనా కలిశాయేమో చూశాడు. లేవని తెలిశాక దాన్ని తీసుకుని, అరటిగెల దొరికిన కోతిలాగా, వీధిలోకి పోయాడు. కాఫీగింజలు వేయించి [illegible] పేపరుమీద పోయాలనుకున్న 'ఇంటిది', అది చూసి కొద్దిగా చిన్నపుచ్చుకుని, మరో 'పాత్ర'ను అన్వేషించసాగింది.

అవిఘ్నంగా అన్ని అడ్డంకుల్నీ అధిగమించి, పడకకుర్చీలో జాగ్రత్తగానేకూర్చొని, పేపరు ఎత్తిపట్టుకున్నాడు గణపతిరావు అతనికి చదవాలని మహాకోరికగాఉంది ప్రపంచవ్యవహారాల్లో జరిగే సంచలనం(మూడురోజులతర్వాతైనా) అతన్ని ఆకర్షిస్తోంది. సూయజ్ గొడవ గణపతి రావుకి అభిమానపాత్రమైంది. ఆ విధంగా...

అయితే అప్పటికి సూర్యాస్తమయం పూర్తయింది గణపతిరావు వార్తల్ని అసలు రుచి కూడా చూడకముందే ఆకాశంలో చుక్కలు వెలిశాయి; ఇళ్ళగదుల్లో గోడల మీద ఒంటరి దీపాలు వెలిగాయి. ఇంజనీరు గారి బంగళాలోంచి రేడియో పాడుతోంది. ఆఫీసుల నించి తిన్నగా ఇంటికిరాక అడ్డా అక్కడా కాలక్షేపం చేసిన కుర్ర గువ్వలు గూళ్ళుచేరుకుంటున్నాయి గణపతి రావు నిరాశతో పూర్తిగా వెనక్కి వాలి ఆకాశం లోకి చూడసాగాడు.

అతనికి భోరున ఏడవాలని పించింది. కాని అతను ఏడవలేదు. "పేపరు చదువుకో లేని బతుకు-ఏంబతుకు!-" అని ఒక సుదీర్ఘమైన పొడి ఏడుపు ఏడ్చాడు. కొంత ఏడుపయ్యాక, షికారునుంచి తిరిగి వచ్చాగు అతని పెద్దకొడుకు వాణి పేపరు చేతికిచ్చి షావుకారు కిమ్మని పంపాడు అతను ఏరోజు తెచ్చిన పేపరు ఆరోజే తిరిగి ఇచ్చేస్తాడు. ఒకరోజు ఇంట్లో ఉంటే అది రూపుమాసి



న్యాయమూర్తి శ్రీ పి. బసిరెడ్డి.

పోవచ్చు. 'పేపరు కనపడలేదండి!' అని బుర్ర గోక్కోవాలిసొస్తుంది సావుకారు ముందు.

అతను కళ్లజోడు తీసి కళ్ళు వేలికొనతో తుడుచుకున్నాడు. తనకి తాలూకా ఆఫీసులో గుమాస్తాగా పాతికేళ్ళ అనుభవం ఉంది. పొదుపుగా బతకడంలో ఒక జీవితకాలం అనుభవం ఉంది. తను మాత్రం పేపరు కొని చదువుకోలేని స్థితిలో ఉన్నాడు.

'పేపరు కొనేస్తా' అనుకున్నాడు. ఇలా అనుకోడం అతనికి అలవాటే. 'పేపరన్నీ జాగ్రత్తచేస్తే నెలాఖరున అమ్మేయవచ్చు. సగంసొమ్ము తిరిగొస్తుంది' అనుకున్నాడు. అప్పుడు తను రాత్రి, పగలూకూడా పేపరు చదువుకోవచ్చు. మరకలూ, చిరుగులూ లేకపోయినా కూడా ఎరువు పేపరుకి సొంత పేపరుకి తేడా బోలెడు. సొంత పేపరుమీద మనంపేరు రాసుకోవచ్చు. నచ్చిన సంగతులు పదిసార్లు చదువుకోవచ్చు, అండర్ లైన్ చేసుకోవచ్చు. మన సౌకర్యంకోసం ఇష్టంవచ్చినన్ని మడతలు పెట్టుకోవచ్చు. ఇంకా ఏమైనా చెయ్యొచ్చు తోచినప్పుడు. ఇన్నాళ్లూ తను సొంతంగా పేపరు కొనకుండా ఎలా ఉండగలిగాడో అని అతనికి ఆశ్చర్యంవేసింది.

గణపతిరావు మనస్సు ప్రశాంతమైంది. నల్లటి ముఖమల్ గుడ్డలాఉన్న ఆకాశమూ, దానిమీద బంగారు పువ్వుల్లాంటి నక్షత్రాలు, గడ్డకట్టిన ఏరులాఉన్న పాలపుంత, ఇంజనీరుగారి ఇంట్లోంచి వచ్చే రేడియో పాట... ఇవన్నీ కలిసి అతని మనస్సులో పాటలు పాడేయి. అతను కొద్దిగా నోరు తెరిచి పైకి చూస్తూ కాలగమనాన్ని, క్రిందనున్న మురుగుకాలవనీ, కుర్చీ సృష్టించగల ప్రమాదాల్నీ మరిచిపోయాడు.

మర్నాడు అతనూ, పెద్దకొడుకూ కలిసి పేపరు చందా ఎంత ఉండబోతుందో తర్జనభర్జన చేశారు. కొడుకు వెళ్ళి ఏజంటుని అడిగొచ్చాడు.

"నెల మొత్తానికి కొంటాంగా. కమీషన్ ఏం ఉండదూ?" ఉండదనీ, విడిరోజులకీ, ఆదివారాలకీ కలిపి అయేది వసూలు చేస్తారని అతనికి తెలుసు. అయినా ఏదో ఆశ!

వెంటనే అతనికి సొంత పేపరులో ఇబ్బందులన్నీ విస్పష్టమైనాయి. అనుకోవడమే గాని సొంత పేపరంటే అంత జాగ్రత్త ఉండదు. నెలాఖరున అమ్ముదామంటే పది



ఆంధ్రప్రదేశ్ హైకోర్టు రిజిస్ట్రారు
శ్రీ ఎస్. ఓబులరెడ్డి

—ఫోటో: పోనగ్రాఫ్

పేపర్లు కూడా కనపడవు. ఆ కొనే వాళ్లు అయిన కాడికి అడుగుతారు. మనం అమ్ముదామంటే అన్నీ అంతే. ఈ వాదనని కొడుకు సమర్థించినా, 'ఇంటేది' తప్పంది. తనేం న్యూస్ పేపర్లని తినేసే జంతువు కాదంది. జాగ్రత్త చేయడం తనకే ఎక్కువ చాతనవునంది. కాని చివరకు ఒప్పుకుంది. "ఎందుకంటే, మనకి పేపరు రోజూ ఒస్తుంది ఔను. రోజూ పొరుగిళ్ళ వాళ్ళు చదివి ఇస్తామని పట్టుక వెళ్తారు. మొదట్లో తిరిగి ఇచ్చేస్తారు గాని తరవాత బద్ధకం వొచ్చి 'కనపడ లేదండీ' అంటారు. అమ్మడూ! నీ పాటల పుస్తకం అలాగే కదూ పోయింది!"...

వాళ్ళు పేపరు సొంతంగాకొనడం మంచి పనికాదని నిర్ణయించారు. అయితే గణపతిరావుకి సాయంకాలం ఆ కోరిక పుడుతూనే ఉంటుంది. ఆ విధంగా 'సొంతపేపరు' అతని సంధ్యాసమస్య. ★

ఒకడు : ఇంత ఖర్చుచేసి మీటింగు పెడితే పదిమంది కూడా రాలేదే?

రెండో : రాకేమండీ! పందిళ్లు వేసినవాళ్లు లైట్లు, లౌడ్ స్పీకర్లు వగైరా బిగించినవాళ్లు, పొద్దుట్నుంచి ఇక్కడే కాచుకొని కూర్చున్నారు.

* * * *

ఒకడు : వాడిపెళ్లికి ఏదైనా మంచి ప్రజంటు ఇద్దామని ఉంది. ఆ ప్రజంటు ఎల్లప్పుడూ నన్ను జ్ఞాపకం చేసేదిగా ఉండాలి. అలాంటి ప్రజంటు పేరు ఒకటి చెప్పరా?

రెండో : చేతిలో ఉన్నప్పుడు ఒక లక్ష రూపాయలు ఇస్తానని ఒక కాగితం రాసివ్వు!

—ఎల్. వెంకటేశ్వర్లు.



అడ్వకేట్ జనరల్
శ్రీ దువ్వూరి నరసరాజు

# కౌకోలు

పాపం, కాకి తన సహజధోరణిలో "కాకా" అరిచినంతమాత్రంలో ఎంత కర్ణకఠోరంగా అనిపించి, వెంటనే మనం అంతకన్నా వికారంగా "హుష్!" అని పొలికేక పెట్టి ఆ కాకిని తరిమికొట్టి తక్కిన పని చూస్తాము. అయితే, ఇతరులకు విన సొంపుకాని వివిధ విషయాలను సేకరించి, విస్తరించి, మనస్సుకు నొప్పికల్పించే మాటల్లో సంధించి పనిగట్టుకొని ప్రక్కవారి చెవులు చిల్లులు పడేటట్లు మనం కూడా "కారులు ప్రేలే" విషయాన్ని మాత్రం విస్మరిస్తూంటాము ఆ ఘనకార్యానికే "లోకులు కాకులు" అనే లోకోత్తరమైన బిరుదుకూడా పొందివున్నామన్నది మనకు తెలియనిదికాదు

పెరీతిగా "లోకులు కాకులు" కావడమే కాకుండా, లోకాంతరగతులైన పితరులు కూడా కాకులైవచ్చి శ్రాద్ధ సందర్భంలో వాయసపిండం ఆరగించి పితృయజ్ఞం అయిందనిపించిపోతారు. ఆనాడు గనుక ఆకాకి అన్నం ముట్టకుంటే, కర్తకు కన్నీళ్ల పర్యంతం అవుతుంది. ఇంటిల్లిపాది వచ్చి పితృదేవతలకు క్షమాపణలు చెప్పుకొంటారు. ఈ ఆచారాన్నే ఒకానొక సందర్భంలో ఆక్షేపిస్తూ "పిష్టమెసవు కాకి పితురుడెట్లయ్యెరా" అని వేమన వేసింది వెర్రిప్రశ్న అంటే అదీకాదు "వేదాతీతుడు వేమన సుమ్మీ" అన్నట్లు మనవంటి సామాన్యులకు గాను ఏర్పరచిన కర్మసిద్ధాంతాన్ని అధిగ

## చదలవాడ

మించి ఉన్నత స్థాయిని అందుకున్న మహా జ్ఞాని, యోగివేమన కాబట్టి పైమాట అతనికి అతనివంటి వారికే చెల్లుతుంది గాని మన బోంట్లు ఆయన వాక్యంలోని పైపై అర్థం మాత్రం గ్రహించి పితృకార్యాలను పరిత్యజించడం "పులిని చూచి నక్కవాత వేసుకోవడం" వంటిదితప్ప మరేమీ కాదు.

కొందరు గృహస్థులు ప్రతిరోజూ కాకికి అన్నం పెట్టకుండా తాము భోజనము చేయరు. మరొక పీనాసిరకం పెద్దమనుష్యులు చేతికంటుకొన్న ఎంగిలి మెతుకెక్కడ కాకి నోట్లో పడిపోతుందేమోనన్న దిగులువల్ల "ఎంగిలిచేత్తో కాకినితోలరు" అనగా వారు అన్నంతింటే చేతులుకూడా శుభ్రంగా నాకేసుకునే రకం వ్యక్తులన్నమాట. అటువంటి "చేతులునాకే" వారు ఎంతజాగ్రత్తగా "నన్ను ముట్టుకోకు నామాలకాకి" అని ఇరుగు పొరుగుతో కలిసి మసలక జాగ్రత్తగా కాలం గడుపుతున్నా, అటువంటివారిండ్లకే "మాతులునాకే వారంటూ" మరొక రకం వ్యక్తులువచ్చి తిష్ఠవేసి తప్పనిసరిగా ఆతిథ్యం స్వీకరించి వెళ్లడం సంభవిస్తూ వుంటుంది.

"నలుపు నాణ్యం" అనే మాటను బుద్ధిపూర్వకంగా మరచిపోయి ఎవరైనా కాస్త నల్లగా కనిపిస్తే వారిని "కాకి నలుపు" అనేస్తాము మనం ప్రొద్దస్తమానం విరామం లేకుండా తిరిగేవారిని పెద్దలు "ఎందుకలా కాకిలా తిరగడం?" అంటూ మందలిస్తారు. ఏదో అప్పుతీర్చుకొన్నట్లు చెంబెడు నీళ్ళు నెత్తినపోసేసుకొని ఎవరైనా స్నానం అయిందనిపిస్తే "ఏమిటా కాకిమునిగినట్లు?" ఎగతాళి చేస్తారు. కాస్త మెల్లకన్ను కలిగి ఓరచూపు చూచేవారిని "కాకి చూపు" అని ఆటాపట్టిస్తారు కట్టడం మనకు సరదా జీవితంలోని కష్టసుఖాల అనుభవం గ్రహించలేని పడుచువారిని పెద్దలు "పిల్లకాకికేం తెలుసు ఉండేలుదెబ్బ!" అని హెచ్చరిస్తూవుంటారు. అర్హతలేని వానికేదైనా పదవి, భాగ్యం, వస్తువు లభించినా, అందం లోపించిన వారికి అందకత్తె భార్యగా లభించినా "కాకి ముక్కుకు దొండపండుకట్టినట్లు" అనే ఉపమాలంకారంతో ఊరిలోని అమ్మలక్కలు ఊసులాడడం జరుగుతుంది "కత్తికి కండగా నరికి కాకులు, గ్రద్దలకు వేయడం" పూర్వకాలం రాజదండనలో ఒకటి. ఆప్తులు సౌమ్యులు, సన్నిహితులైన వ్యక్తులు "కాకితో కబురంపితే" చాలు; వచ్చిన ఆపదలలో ఆదుకుంటారు. మనలో పరస్పర విరోధాలు ముదిరి విడిపోతే "ఈ ఇంటికాకి ఆ యింటిమీద వాలకూడదు!" ఇంట్లో పిల్లలు అరుస్తూ, అల్లరి పెడుతూ, నానా

హంగామా చేస్తూవుంటే, విసిగిపోయి "ఆపంద్రా కాకిగోల!" అంటారు పెద్దలు. ఎదుటివ్యక్తిని బాధ పెడుతూనైనా తమపని సాధించుకొనేవారి నుద్దేశించి "ఎద్దుపుండు కాకికిముద్దా?" అనే సామ్యం వాడుతూంటాము మనం. ఆచరణమాట అటు వుంచి, "కాకిగా కలకాలం బ్రతకడంకన్నా, హంసగా ఆరునెలలు జీవి స్తేచాలు!" అంటూ ఆదర్శాలు వల్లె వేస్తూవుంటారు కొందరు పెద్ద మనుష్యులు. ఒకరిని మోసంచేసి ఒకవంక దోచుకొంటూనే మరొకవంక దానధర్మాలు చేస్తూ ధర్మదాతలనిపించుకొంటారు కొందరు. వారిచేతలను "కాకులనుకొట్టి గ్రద్దలకు వేయడం" అంటారు. "కాకికి క్రమంటే మగణ్ణికాగలించుకునే" విచిత్ర ప్రకృతులున్న వారుకూడా మనలోవున్నారు. మొత్తానికి మనలో కొందరు ఏదిక్కూలేని "ఏకాకి"గా వుంటే మరికొన్ని పాపిషిఘటాలు "పలుగాకులు"గా చెడుతిరుగుళ్ళు తిరుగుతూ వుంటారు.

ఘరానావ్యక్తులను ఆశ్రయించి, ఆత్మగౌరవాన్ని చంపుకొని, వారికి అరవచాకిరి చేసి, అర్హతలేకున్నా, కొందరు స్వకార్యాలు సాధించుకొని పైకివస్తారు. ఏతత్కార్యానికి తమిళంలో "కాకా పుడిక్కరదు" అంటారు. ఆమాట తెలుగులో "కాకాపట్టడం"గా దిగుమతి కావడంకాక ఆంగ్లంలోనూ "Crow-catching"గా ఏర్పడిపోయింది.

కవుల తమపేరూ నీటికాకులపేరూ ఒకటన్న విషయాన్ని విస్మరించి కాకులను తమకవిత్వంలో దుయ్యబట్టినారు. "కాకిపిల్ల కాకికిముద్దు" అన్న సత్యాన్ని అందరూ ఒకవంక ఒప్పుకొంటున్నా "వసంత కాలే సంప్రాప్తే కాకః కాకః పికః పికః" అని కాకిపిల్ల నుగురించి అన్నాడొకకవి "తెల్లని కాకులునులేవు తెలియర సుమతీ" అన్నాడింకొకకవి. కాని ఆ మధ్య మద్రాసు జూలోకి తెల్లకాకిని తెచ్చేసరికి పై కవి వాక్యాన్ని తాత్కాలికంగా సంశయించడం జరిగింది. తర్వాత ఆకాకి బ్రతకలేదన్న వార్త విన్నతర్వాత, పైపద్యపాదం మన దేశంవరకన్నా నిజంగా నిలిచింది. "పంజరంబున కాకి పక్షీనుంచిన తెస్సపలుకు నేవింతైన చిలుకవలెను?" అంటూ మరొకచోట కాకిని ఉపమానంగా పేర్కొన్నాడు నరసింహ శతకకవి. ఇవిగాక కథాసాహిత్యంలో కాకులకథలకు కొదవలేదు. కాకి-పిచ్చుక కథ. కూజాఅడుగున నీటిని గులకరాళ్ళు వేసి పైకిరప్పించి దాహంతీర్చుకొన్న తెలివిగల కాకికథలతో పిల్లలకథలున్నవి. పంచతంత్రంలోని ప్రజ్ఞాసమన్వితములైన పలురకాల కాకులతో నిండివుంటుంది ఈసాహిత్యశాఖ.

అవ్వకథలో ఒకకాకి కట్టెలయిల్లు కడుతుంది. పిచ్చుక పిడకలయిల్లు కడుతుంది. కాకి కడవెత్తుకొని నీళ్ళకుపోతే, పిచ్చుక జల్లెడతీసుకుపోతుంది. కాకి త్వరగా నీరు ముంచుకొని యిల్లుచేరుతుంది. పిచ్చుక "నీరు ముంచంగా, కారంగా, ముంచంగా, కారంగా" అవస్థపడుతూ కాలహరణం చేస్తూండేసరికి వానవచ్చి పిచ్చుకమ్మ పిడకలిల్లు తడిసి ముద్దయిపోతుంది ఆ రాత్రికి కాకమ్మగారింట్లో తలదాచుకుందామని తలుపుతడుతుంది పిచ్చుకమ్మ. కాని కాకమ్మ ప్రతిపిలుపుకూ, పిల్లలకుస్నానం చేయిస్తున్నానని, బట్టలు తొడుగుతున్నానని, అన్నం పెడుతున్నానని, నిద్రపుచ్చుతున్నానని, భర్తకు అన్నం పెడుతున్నానని, తాంబూలం మడిచియిస్తున్నానని, నిద్రరావడానికి కాళ్లు పిసుకుతున్నానని, తాను భోంచేస్తున్నానని, వంటిల్లు సర్దుతున్నానని చెపుతూ ఎంతసేపటికీ తలుపుతీయదు. ఈరకం కల్లబొల్లి కబుర్లకే "కాకమ్మ కబుర్లు" అని పేరు. లోలోపల ఇష్టంలేకున్నా ఆశ్రయించిన వారిని అదుగో ఇదుగో అంటూ కొందరు వెంటత్రిప్పుతూ సహాయంచేయకనే జాప్యం చేస్తూంటారు—ఈ కాకమ్మకబుర్లతో. గత్యంతరంలేని పిచ్చుకమ్మవంటి పిచ్చివారు వీరివెంట తిరుగుతూవుంటారు చేటికి. ఇది లోకంపోకడ!

ఒక కాకికి ఏదైనాతినడానికి కనిపిస్తే చాలు. వెంటనే కూతపెట్టి తక్కిన కాకులను రప్పిస్తుంది. అటువంటి సంఘజీవిని మనం మనకుగల కులవ్యత్యాసాల దృష్టితో చూచి, మెడచుట్టూ కాస్త తెల్లగా వుంటే "బ్రాహ్మణ కాకి" అని, శరీరమంతా కారునలుపైతే "మాలకాకి" అంటూ వ్యత్యాసాలు కల్పిస్తాము. ఇవికాక "జెముడు కాకి" అంటూ మరొకరకం పక్షి వుంది. ప్రయాణ విషయాలలో "కాకిశకునం" పాటించటం మన ఆచారాలలో ఒకటి. "కాకి అరిస్తే చుట్టాలు వస్తారు" అన్నది మన నమ్మకాలలో ఒకటి. "కాకులు దూరని కారడవులు" మన కథాసాహిత్యంలో కొల్లలుగ వున్నవి. ఒక

# ★ కాకులు ★

వూరికి, మరొక వూరికి గల మధ్య దూరాన్ని ఇన్ని మైళ్ళు అని నిర్ణయించడానికి "As the Crow flies" అంటూ వాయసగమనాన్ని ఆధారంగా తీసుకొన్నారు. వ్యుత్పత్త్యర్థం ఎలాగో కాని గడ్డపార (గునపం)కు Crow Bar అంటారు ఆంగ్లంలో. "Crow" అనే పేరు కూడా ఆంగ్లేయుల్లో వుంది. "కాకాసురుడు" అనే రాక్షసుడు పూర్వం వుండేవాడు. వాడొకప్పుడు శ్రీరాముని ఆగ్రహానికి గురికావలసి వచ్చింది. రామచంద్రమూర్తి అభిమంత్రించి విడిచిన తృణమే అస్త్రమై అసురుని వెంటాడి ముల్లోకాలు పరుగెత్తించి ముప్పతిప్పలు పెట్టేసరికి అరచేత ప్రాణాలు పెట్టుకుని కాకాసురుడు రామయ్య కాళ్ళు పట్టుకొని క్షమాపణ చెప్పుకొని అస్త్రానికి ఒక కన్ను ఆహుతిగా ఇచ్చేసి ప్రాణం దక్కించుకొన్నాడు. ఈ కథే "చావు తప్పి కన్ను లొట్టపోయింది" అన్న సామెతకు ఆధారం. కుంటికాలి గ్రహమైన శనేశ్వరునికి ఒంటిమాపు కాకి వాహనం. నాటకరంగంలో రాజుగారు అలంకరించేది "కాకిబంగారు" పుగద్దె. ఆంధ్రప్రదేశ్ ముఖ్యనగరాల్లో "కాకినాడ" ఒకటి. "కాకులపాటివారు" అన్నది ఒక ఇంటిపేరు ఇందువల్ల "కాకులపాడు" అనే గ్రామం కూడా ఎక్కడో తెలుగుదేశంలో వుండడం తెలుస్తుంది. నెల్లూరిలో ఒక వ్యక్తికి "ఉష్ కాకి" అని పేరు. అతనివద్దకు వెళ్ళి ఎవరైనా "ఉష్ కాకి" అంటే చిరాకు పుట్టుకొచ్చి, చితకతన్నడానికి వెంటబడేవాడు పాపం ఆ వ్యక్తి అందువల్ల అతనికా పేరు స్థిరపడిపోయింది.

"కాకతాళీయంగా" ప్రపంచంలో కొన్ని సంఘటనలు జరుగుతూవుండడం సహజం. అటువంటి సంఘటనలతో అనుకోకుండా సంబంధపడిన మామూలు వ్యక్తులకు లేనిపోని మహత్తు కల్పించి ఆకాశాని కెత్తుతూండడం అలవాటు. కాకి కూర్చున్న క్షణాన తాటిపండు పడివుండవచ్చును. అంతమాత్రంచేత ఆ కాకి కూర్చున్నందువల్లనే ఆ పండు పడిందని వాదించడం అసమంజసం. అటువంటి మిథ్యాప్రచారంవల్ల పనికిరానివారు పైకి రావడం, నిజమైన మేధావులు "నివురుగప్పిన నిప్పులు" గా నిలిచిపోయి అవి క్రమేపీ బూడిదై చప్పచల్లారిపోయేటట్లు అజ్ఞాతంగానే వుండిపోవడం జరుగుతుంది. అటువంటి అవకతవకలు జరుగనీయకుండా ప్రతిభావంతులను పైకి తెచ్చి ప్రపంచానికి పరిచయం చేయగలిగితేనే ప్రగతికి పునాదులు వేసినవార మవుతాం. ★

# నక్షత్ర ఫలితాలు

**( 13-11-57 మొదలు 19-11-57 వరకు )**

బి. నరసింగరావు

### గ్రహస్థితి

| | శ | | |
|---|---|---|---|
| — | 16 తేదీని రవి వృశ్చికమున ప్రవేశించును. కర్కాటక, సింహ, కన్యా, తులలలో చంద్రుడు. | | — |
| కు | ర బు శ | రా | గు |

### *అశ్విని [చూ, చే, చో, లా]*

గత వారమున కలిగిన అవయోగము ఈ వారమున మిమ్ములను వదులును. చాలా కాలమునుండి విడవకుండా వున్న చిక్కు సమస్యలు పరిష్కారమవుతాయి. కోర్టు వ్యవహారములు కూడా అనుకూలముగా తీర్పు అవుతాయి. కొత్తవారిని కలుసుకుంటారు. మంగళకరమైన కార్యముల గురించి బంధువులతో ఆలోచిస్తారు. భార్యకు అలంకార ప్రాప్తి. పిల్లల అభివృద్ధిచే సంతోషపడుతారు. ఉద్యోగులకు అధికారుల ఆదరణ కలుగుతుంది. విద్యార్థులకు, న్యాయవాదులకూ మేలుకాలము. పండితులకు సన్మానము 13, 14, 15 తేదీలు కార్యభారము, త్రిప్పట. 16 తేదిని ప్రయాణము, వారాంతమున శుభయోగం.

### *భరణి [లీ, లూ, లే, లో]*

పోయిన వారము మీకు కలిగిన కష్టములు ఈ వారము తీరిపోతవి. అనుకున్న సొమ్ము చేతికి వస్తుంది. బంధుదర్శనమువల్ల లాభము పొంది మృష్టాన్న భోజనముతో వినోదిస్తారు. విద్యార్థుల చదువు చురుకుగా సాగుతుంది. ఉద్యోగస్తులకు అధికారుల తొందరలు వుండవు. గృహమందుండువారికి అలంకార ప్రాప్తి. గాయకులకు, నటీనటులకు యోగ కాలము. 13, 14, 15 తేదీలలో ఖర్చులు ఎక్కువగుటచే అశాంతి, శ్రమ. 16 న ప్రయాణము. 17, 18, 19 తేదిలలో వెండి వర్తకులకు లాభము, శుభయోగము.

### *కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ]*

ఈ వారము మీకు గ్రహానుకూలత ఎక్కువగుటచేత యోగదాయకముగా గడుస్తుంది. గతవారము అసంపూర్తిగా వున్న పనులను లాభకరముగా పూర్తిచేసుకుంటారు. రత్నములు, బంగారము మొదలైనవి కొనుటవల్లగాని అమ్మటవల్లగాని వర్తకులకు లాభము. విద్యార్థులు శ్రద్ధగా చదువుకుంటారు. కవులకూ, గాయకులకూ, కళాకారులకూ, నటీనటులకు యోగకాలము. 13, 14, 15 తేదీలలో త్రిప్పట, అశాంతి 16 న ప్రయాణము. 17, 18, 19 తేదీలలో స్త్రీలతో మిత్రులతో విందు, వినోదము, శుభవార్త.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈ వారము శరీరమునకు ఎక్కువ శ్రమ గలిగే పనులు చేయవలసివచ్చుటచేత మనస్సునకు అశాంతి కలుగుతుంది. ఆర్థికస్థితి తృప్తికరముగా వుండదు. ఖర్చులు ఎక్కువవుతవి. కోర్టువ్యవహారాలు వాయిదా పడతాయి. ఉద్యోగులకు ఒత్తిడి ఎక్కువ. వారాంతమందు కొంత మెరుగు. పితృవరమునుండి అపేక్షించిన ధనసహాయము సకాలంలో రాదు. 13, 14, 15 తేదిలలో అశాంతి 16, 17 తేదీలలో ప్రయాసముతో కూడిన ప్రయాణము.

### *మృగశిర [వే, వో, కా, కీ]*

ఈ వారము మీకు యోగకాలము కాదు. మొదట్లో కార్యములు అనుకూలించి చివరకు ప్రతికూలముగా పరిణమించుటచే ఆశాభంగమగును. అయిననూ కొందరు మిత్రులు మీరు కోరకుండా అడ్డుపడుటవల్ల కొంత సానుకూలమైనందున ఊరట కలుగుతుంది. ఉద్యోగులకు అధికముగా ఒత్తిడి ఎక్కువవుతుంది. వ్యాపారస్తులకు మాంద్యముగా వుంటుంది. విద్యార్థులకు చదువుమీద శ్రద్ధ తక్కువ. 13, 14, 15 తేదీల అవసరాలు తీరనందున మనోవ్యధ. 16, 17 సంచలనము. వారాంతమున మిత్రసహాయము.

### * ఆరుద్ర [కూ, ఖ, ఙ, ఛ] *

ఈ వారమున మీకు మిశ్రమయోగము. అనుకున్న పనులు కాకపోయినను, ఖర్చులు ఎక్కువైనను, ఉత్తమ మతగ్రంథములు చదువుటచే ఆధ్యాత్మికచింత కలిగి మనశ్శాంతి ఏర్పడుతుంది. సంసారముపట్ల నిర్మోహముగా వుండుటవల్ల గృహకలతలు వస్తాయి. ఉద్యోగస్తులు కొంత కష్టపడిన మీదట మేలు పొందుతారు. విద్యార్థులకు చదువుపై ఆసక్తి తక్కువ. అయిననూ నూతన విషయాలు నేర్చుకుంటారు. 13, 14, 15 తేదీలలో కార్యభంగము. అశాంతి. 16 న ప్రయాణము. వారాంతమున కొంత సహాయము.

### * పునర్వసు [కే, కో, హా, హీ,] *

ఈ వారము కార్యభారము ఎక్కువవుతుంది. సకాలములో సొమ్ము చేతికిరాక, ఖర్చులు ఎక్కువగుటచేత అస్థిమితము కలుగుతుంది కోర్టువ్యవహారములు కొంతవరకూ అనుకూలిస్తవి. ఉద్యోగులకు శ్రమ వ్యాపారస్తులకు అశాంతి. స్త్రీలతో వివాదము. ఆరోగ్యము చెడే సూచనలున్నవి; శ్రద్ధ వహించడము మంచిది. శనికి శాంతిచేయుట

---

### ధరలు

నూలు, వస్త్రములు: స్వల్ప తేడాలలో వుండును

నూనెదినుసులు: మందగించును.

బెల్లము, పంచదార, చింతపండు :- మార్పు లేదు.

ఆహారధాన్యములు -మందగించును.

పప్పుదినుసులు: సమముగావుండును.

వెండి, మార్పు లేదు.

బంగారము . స్వల్ప తేడాలలో వుండును.

అచ్చటచ్చట సామాన్యముగా వర్షించును. మద్రాసునకు దక్షిణమున సువృష్టిగానుండును.

జన్మనక్షత్రమునుబట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్లననుసరించి పేరు మొదటి అక్షరము)ను బట్టిగాని ఫలితములను తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరా నక్షత్రమును, వృష్ణుడను పేరునకు స్వాతీ నక్షత్రమును, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడనే పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకొనునది.

#  నక్షత్ర ఫలితాలు 

మేలు. విద్యార్థులకు వినోదములపై ఆసక్తి, చదువుమీద అశ్రద్ధ 13, 14, 15 తేదీలలో కార్యభారము, ఆశాభంగము. 16 న లాభము లేని ప్రయాణము. 19 వ తేదీన వివాదము.

***పుష్యమి [హూ, హే, హో, డా]***

ఈ వారము సోదరునివల్ల ఆశించిన సహాయము అదునుకు రాకపోవుటచేత, మిత్రులు తటస్థముగా వుండుటచేత యత్న కార్యములు నెరవేరక మనోవ్యధ కలుగుతుంది. ఉద్యోగస్తులకు అధికారుల చురుకుమాటలవల్ల మనస్సు గాయపడుతుంది. విద్యార్థులకు చదువుపైకన్న వినోదములపై ఉత్సాహముగా వుంటుంది. దెబ్బలు తగులవచ్చు. 13, 14, 15 తేదీలలో కార్యహాని, అలజడి [illegible] తేదీని [illegible]రకులకు లాభములేని ప్రయాణము. 19 తేదీ ప్రమాదము. ఆరోగ్య భంగము.

***ఆశ్రేష [డీ, డూ, దే డో], ***

ఈ వారము పదవిలోనుండువారి సహాయమువల్లనే కాకుండా మీ స్వప్రయోజనముచేతకూడా కార్యానుకూలతను పొందుతారు. కొత్తమిత్రులను కలుసుకొనుట, సంతోషవార్త వినుట వంటి శుభఫలితాలు కలుగుతాయి విద్యార్థులు నూతనాంశాలను నేర్చుకుంటారు. గృహమందుండువారితో వినోదముగా గడుపుతారు. ఉద్యోగులకు అధికారులమన్నన వుంటుంది. వ్యాపారస్తులకు లాభం. కళాకారులకు నటీనటులకు యోగకాలము 13, 14, 15 తేదీలలో శ్రమ 16, 17 తేదీలలో లాభముతోకూడిన ప్రయాణము.

*** మఖ [మా, మీ, మూ, మే] ***

ఈ వారము మీకు చాలా యోగకాలం పండితులవల్ల కొత్త సంగతులు తెలుసుకుంటారు. కొంతకాలమునుండి పరిష్కారము కాకుండాఉన్న కోర్టు వ్యవహారము వంటి సమస్యలు అనుకూలముగా నెరవేరుతవి. విద్యార్థులు చురుకుగా విషయాలు నేర్చుకుంటారు. ఉద్యోగస్తులకు మేలు కాలము. సంతానమునకు అభివృద్ధి కలుగుతుంది. కళాకారులకు, పండితులకు మంచికాలము. 13, 14, 15 తేదీలలో శ్రమతో కూడిన అనుకూలత. 16, 17 తేదీలలో వర్తకులకు ప్రయాణమువల్ల లాభం.

*** పూర్వ ఫల్గుణి (పుబ్బ) ***
**[మో, టా, టీ, టూ]**

ఈవారము మీకుయోగదాయకము. యత్న కార్యములు సిద్ధిస్తాయి. మిత్రులతో వినోదములలో పాల్గొంటారు. ఉత్తరదిక్కునుండి శుభవార్త వస్తుంది. వెండి వ్యాపారస్తులకు మంచికాలము. విద్యార్థులకు నూతనోల్లాసము కలుగుతుంది. కళాకారులకూ, కవులకూ, నటీనటులకూ యోగకాలము. 13, 14, 15 తేదీలలో కొత్త పరిచయము. స్వల్ప అశాంతి 16, 17 తేదీలలో ప్రయాణమువల్ల లాభము. 19 వ తేదీని కొంత ప్రతికూలత.

*** ఉత్తర ఫల్గుణి (ఉత్తర) ***
**[టే, టో, పా, పి]**

ఈ వారము ధనాదాయము ప్రోత్సాహకరముగా వుంటుంది. పుణ్యకార్యాచరణలో నిమగ్నులౌతారు. కోర్టు వ్యవహారములు సుముఖమవుతాయి బంగారము వర్తకులకు లాభము కలుగుతుంది విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. పిల్లల శుభకార్యములను గురించి బంధువులతో ఆలోచనలు చేస్తారు. ఆప్తులతో విందారగిస్తారు. కవులకూ, గాయకులకూ, నటీనటులకూ యోగకాలము 13, 14 15 తేదీలలో శ్రమ ఎక్కువ. 16, 17 తేదీలలో ప్రయాణము. వారాంతమున శుభం.

*** హస్త [పూ, ష, ణ, ఠ] ***

ఈ వారము మీ ఆదాయాభివృద్ధికి పెద్ద ప్రయత్నాలుచేసి ఫలించక ఆశాభంగము పొందుతారు. ఉద్యోగాధిక్యత కలుగుతుంది. కొన్ని కొత్త సమస్యలు తలెత్తి ఆందోళన కలుగజేస్తాయి. ఆర్థిక ఒడిదుడుకులవల వర్తకులకు అశాంతి. గృహకలతలు కలుగుతాయి. ఆరోగ్యభంగసూచనలు కనబడగానే శ్రద్ధ వహించడమువల్ల మేలు. 13, 14, 15 తేదీలలో కార్యభంగము, అశాంతి. 16, 17 తేదీలలో లాభములేని ప్రయాణము.

***చిత్త [పే, పో, రా, రీ]***

ఈ వారము మిశ్రమఫలములు కలుగుతవి. కార్యహానివల్ల మొదట్లో నిరాశ కలిగినను మిత్రసహాయమువల్ల అనుకూలించి శాంతి కలుగుతుంది. శక్తికిమించిన కార్యభారము పైన వేసుకోడంచేత ఫలితము లేకపోయి శ్రమ అధికమవుతుంది. ధనలోపమువల్ల కలిగే ఇబ్బంది ప్రతివిషయంలోనూ కనబడుతుంది. కుటుంబావసరాలు తీరనందున అసంతృప్తి. ఆరోగ్యభంగము కలుగుతుంది. 13, 14, 15 తేదీలలో వర్తకులకు నిరాశ. కార్యభంగం. 16 తేదీని ప్రయాణము. మిత్రసహాయము. 19 వ అనారోగ్యము.

*** స్వాతి [రూ, రే, రో, తా] ***

మిమ్ములను అవమానముల పాలు చేయుటకు కొందరు శత్రువులు పన్నే పన్నాగాలకు మీ పలుకుబడివల్ల విరుగుడు కలుగజేస్తారు. కోర్టువ్యవహారములలో ఖర్చులు అధికము. ఎన్నిచిక్కులు వచ్చినా ఈశ్వరానుగ్రహము కలుగుతున్న నమ్మకముతో వుండుటచే శాంతి కలుగుతుంది. అవకాశములు చెయ్యిజారుతున్నట్లు కనబడినా వ్యాపారస్తులు ఆందోళన పొందనవసరము లేదు. తుదకు మేలు కలుగుతుంది. 13, 14, 15 తేదీలలో అవమానమువల్ల అశాంతి. 16, 17 తేదీలలో త్రిప్పట. అనారోగ్యము.

***విశాఖ [తీ, తూ, తే, తో]***

కార్యభారము ఎక్కువగుటచేత శ్రమ అధికము. ఆదాయము తక్కువయి అనుకున్న సహాయము సమయమునకు కలుగక, నీచులతో తగాదాలు వచ్చుటవల్ల మీ హోదా కొంత దెబ్బతింటుంది. కోర్టు వ్యవహారములను మీ పలుకుబడివల్ల అనుకూలంగా పరిష్కారము చేసుకుంటారు గృహకలతలు కలుగుతాయి ఉద్యోగస్తులకు అశాంతి 13, 14, 15 తేదీలలో కార్యభారము; అశాంతి 16, 17 త్రిప్పటచే అసౌఖ్యం. ప్రయాణముకలిగేసూచనలున్నవి 19న అనారోగ్యము, గౌరవభంగము

***అనూరాధ [నా, నీ, నూ, నే]***

ఈ వారము ఆర్థికతొందరలచే అసౌఖ్యం ఎక్కువ అనవసరమైన బాధ్యతలను పైన వేసుకొని నెరవేర్చలేక మాటపడవలసివస్తుంది సోదరసహాయమువల్ల కొంతఊరట ఏర్పడుతుంది వ్యాపారస్తులు క్రిందుమీదవుతారు. ఆరోగ్యవిషయములో యేమాత్రమూ నిర్లక్ష్యము చూపెడు 13, 14, 15 తేదీలలో ఇబ్బందులు; అనారోగ్యము. 16, 17 తేదీలలో త్రిప్పటచే అసంతృప్తి 19న ప్రమాదభయము.

***జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]***

ఎన్ని చిక్కులు వచ్చినను మీ బుద్ధిబలమువల్ల సాధించి మేలు పొందుతారు. సంఘములో మీ పలుకుబడి ఎక్కువవుతుంది కోర్టు వ్యవహారములలో అనుకూలపరిష్కారాలు జరుగుతాయి. ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ వుంటుంది. వ్యాపారస్తులకు మేలుకాలము. విద్యార్థులు విజ్ఞానదాయక విషయాలు నేర్చుకుంటారు. కవులకు, చిత్రకారులకు, కళాకారులకు యోగము 13, 14, 15 తేదీలలో శ్రమ అశాంతి 16, 17 తేదీలలో ప్రయాణము. నూతన వ్యక్తుల పరిచయము. కార్యలాభము.

## *మూల [యే, యో, బా, బీ]*

మీరు కోరుకున్న ధనసహాయము సకాలములో పొందుటచేత కొంతకాలమునుండి నిలిచిపోయిన కార్యములు ఈవారము లాభదాయకముగా సాధించగలుగుతారు. ఉత్తర దిక్కునుండి సంతాన విషయమైన సంతోషవార్త వస్తుంది. ...కార్య ప్రయత్నములు ఫలించుతాయి. ఉద్యోగస్తులకు చికాకులు తొందరలు తీరిపోతాయి. 13, 14, 15 తేదీలలో కార్యసాధనలో శ్రమ, త్రిప్పట. 16, 17 తేదీలలో ప్రయాణమువల్ల వర్తకులకు లాభము.

## *పూర్వాషాఢ [బూ, ధ, బా, ఢ]*

ఈ వారము మీకు చాలా యోగకాలము. సకాలములో ఆర్థిక సహాయ సహకారములు చేకూరుటచే అన్నిపనులు అనుకూలముగా ముగించుకుంటారు. పోర్టువ్యవహారములు మీ పరము అవుతాయి. కాని ఖర్చులు ఎక్కువగుటచే ఆసంతోషము మీకు ఉండదు. తూర్పుదిక్కునుండి శుభవర్తమానము వినవచ్చును. విద్యార్థులకు అనుకూలముగా వుంటుంది. వర్తకులకు లాభము 13, 14, 15 తేదీలలో కార్యాచరణలో త్రిప్పటవల్ల శ్రమ 16, 17 ప్రయాణము; బంధువులతో మృష్టాన్నభోజనము. కవులకు కళాకారులకూ, నటీనటులకూ మంచికాలము.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము అనుకూల కార్యసాధనకి మీ నేర్పు ఓర్పు ఉపయోగించుకుంటారు. సకాలములో అనుకున్న ధనాదాయము వస్తుంది. కుటుంబముందుండువారితో కలసి, గాయకులతోనూ కళాకారులతోను వినోదముగా గడుపుతారు. ఉద్యోగస్తులకు అధికారులదయ కలుగుతుంది. నూతన వస్తువాహనాలను సంపాదిస్తారు. విద్యార్థులు క్రొత్త విషయాలు నేర్చుకుంటారు 13, 14, తేదీలలో కార్యభారమువల్ల శ్రమ అధికము 16, 17 తేదీలలో వర్తకులకు ప్రయాణము వల్ల లాభము.

## *శ్రవణము [జూ, జే, జో, ఖా]*

ఏ కార్యము చేయుటలోనూ తగిన నిర్ణయ మునకు రాలేక సకాలములో పనులు జరగనందున శరీరకష్టము ఎక్కువగుట, మానసిక స్థితి అతృప్తికరముగా యుంటుంది. పెత్తె వర్గమునుండి పొందవలసిన ధనసహాయము వేళకు రాకపోవుటచేత గృహకలతలు ఏర్పడును. ఆరోగ్యము చెడే సూచనలు కనబడ గానే శ్రద్ధవహించడము మేలు 13, 14, 15 తేదీలలో త్రిప్పట, ఉష్ణాధిక్యము 16, 17 తేదీలలో అస్థిమితము అనారోగ్యము. 19 వ ఉద్యోగస్తులకు తొందర.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము ప్రతికూల అనుకూలములతో మిశ్రమయోగము కలుగుతుంది. మొదట్లో ప్రతికూలత ఏర్పడినను క్రమేణా అనుకూలముగా కార్యములు నేరవేరుతవి. శత్రువనుకొని అనుమానించిన వ్యక్తి మీ యెడల మిత్రత్వము చూపుటచే ఆశ్చర్యము పొందుతారు. కార్యభారము ఎక్కువగుటచే నిరుత్సాహము విద్యార్థులకు బద్ధకము ఎక్కువ 13, 14, 15 తేదీలలో ఖర్చులు ఎక్కువగుటచే అశాంతి 16, 17 తేదీలలో మిత్రసహాయము, మేలు.

## *శతభిషం [గో, సా, సీ, సూ]*

ఈ వారము మీకు యోగకాలము కాక పోవుటచేత కార్య విలంబనము జరుగుతుంది మీరు ప్రజ్ఞావంతులగుటచే ఓర్పుతో కార్యాచరణ చేస్తారు. అయినను ఆటంకములు కలుగుతూనే వుంటాయి. ధైర్యము విడువకుండా పెద్దల సాంగత్యమువల్ల గ్రహించిన సలహాల ప్రకారము నడుచుకొని ఈశ్వరానుగ్రహమును పొందే ప్రయత్నాలు చేస్తారు. ఉద్యోగస్తులకు ప్రయాసము కలుగుతుంది 14, 15 తేదీలలో ప్రతికూలత. 16, 17 తేదీలలో విజ్ఞానులను కలుసుకొనుట, మేలు.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] *

ఈ వారమున ఇచ్చిపుచ్చుకొనే వ్యవహారములలో నీచులతో వివాదము వచ్చి మనోవ్యథ పొందుతారు. ఆర్థిక మాంద్యముచే యత్న కార్యములు నెరవేరవు. శ్రమ అధికమవుతుంది. గృహకలతలు వస్తాయి. భార్య ఆరోగ్యమునుగూర్చి మనోవ్యథ పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడి ఎక్కువ 13, 14, 15 తేదీలలో త్రిప్పట. ఆశాభంగము.

## *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

సాహసముతో ఎక్కువ శ్రమ కలిగే పనులను ప్రారంభించి ఫలము పొందక నిరాశచెందుతారు. అయినను సోదరుని సహాయమును పొంది వారాంతమున కొంత అనుకూలము కలుగుతుంది. గృహ కలతలవల్ల మనసు వికలమవుతుంది. గాయములు కలిగే ప్రమాదమువుంది 13, 14, 15 తేదీలలో ఉద్యోగస్తులకు మనోవ్యథ. 16, 17 ప్రయాణము సహాయము, కొంత కార్యానుకూలత. వర్తకులకు ఒత్తిడి ఎక్కువ.

## * రేవతి [దే, దో, చా, చీ] *

మిమ్ములను ఇదివరకు ఎదుర్కొంటూ యున్న ప్రతికూల సంఘటనలు సర్దుకొని యత్న కార్యములు కొంతవరకూ ఫలిస్తాయి. శుభకార్యములగురించి చేసిన ప్రయత్నములు పరిష్కారానికి వస్తాయి. కవులు గ్రంథరచనకు పూనుకుంటారు. గృహము దుండువారి ఆరోగ్యము బాగుపడుతుంది. విద్యార్థులు నూతనవిషయాలు నేర్చుకుంటారు 13, 14 తేదీలలో కార్యభారము 16, 17 తేదీలలో ప్రయాణము. కార్యానుకూలత, మిత్రలాభము కళాకారులకు నటులకు యోగకాలము.



★

# ఆపద్బాంధవి! ఆ



## జేబుగు మాహాత్మ

నేను హైస్కూల్లో చదువుతూ వుండగా—

నాకుబాగాజ్ఞాపకం—సుబ్బారావుగారని మా హెడ్‌మాస్టరు ఎప్పుడూ ఒక రుమాలా కోటు కుడివైపు క్రిందిజేబులో వుంచుకుంటూ వుండేవారు. నువ్వు ఆ జేబులో వుండు, నేను ఈ జేబులో వుంటాను అంటూ దానికి సహాధ్యాయినిగా ఎడమవైపు క్రిందిజేబులో ఒక ముక్కుపొడుండబ్బీ వుండేది. ఆ క్లాసు కన్నా రాబోయేముందు, చర్రున పొడుం డబ్బాలాగి, బుర్రున రెండుపట్లు పీల్చేసి, చిర్రున చీదేసి మరీ బయల్దేరేవాడు. వెంటనే అలవాటుప్రకారం ఆ చేయి అలాగే - కుడి చేయి అన్నంముద్దతోసహా ఎలా నోట్లోకి వెడుతుందో అలాగే - ఆ జేబులోకివెళ్లి ఆరుమాలాని చెవులపిల్లిని లాగినట్లు బయటకు లాక్కొచ్చేది! దాంతో ఆయనా ముక్కుని తుడిచి, ఇంకా ఆ నాసికా సందర్భంలో ఏమైనా అనుమానంవుంటే ఆ రుమాలా అలా అడ్డంవుండగానే పనిపూర్తిజేసి దాన్ని తిరిగి స్వస్థానానికి జేర్చేవాడు. పాపం ఆయనకు ఆ జేబుగుడ్డతో అంతవరకేపని. మళ్ళీ తిరిగి దాని జోలికి పోయేవాడుగాదు అందుచేత మా ఎలిమెంటరీస్కూలు మాస్టారులా కాకుండా కొంచెం శుభ్రంగానే వుండ గలిగేవాడు

శేషగిరిగారు మా ఎలిమెంటరీస్కూలు పంతులుగారు; ఆయనస్థానం ఓ తలుపు ప్రక్కన ఏరికోరి ఆయన బల్లా, కుర్చీ అక్కడే వేయించుకున్నాడు. ఆయనదగ్గర పొడుండబ్బీ బదులుగా పొడుంకాయ వుంటూవుండేది మేమంతా పిల్లవెధవలమనో ఏమో, వెనకాముందూ లేకుండా మాముందరే శుభ్రంగా కాయవంచి ఓ పావుతులందాకా ఎడంచేయి అరచేతిలో పడనిచ్చి, ఆ అర చేతిని అల్లాగేవుంచి వేళ్లసందున కాయపెట్టి మూతపెట్టి జేబులో వేసుకోడంతోటి ప్రథమ ప్రకరణం ముగిసేది; ఆ తర్వాత చేతులో వున్న పొడుంలోంచి సగభాగం మందుతీసి రెండు నాసికారంధ్రాల్లోకి పంపించి, తిరిగి మిగిలిపోయిన దానికేసి పరకాయించిచూసి, ఇంకోపట్టులో అదంతా పీల్చి, అప్పటికీ అరచేతిలో ఏమయినా మిగిలివుంటే, ఆ అర చేతిని అమాంతం అలాగే ముక్కుదగ్గరకు పోనిచ్చి పూర్తిజేసేవారు.

దాంతో మూడవప్రకరణం ఆరంభం అయేది......తలుపు ప్రక్కనే కూర్చునే వాడని అన్నానుకదూ.. అల్లా ఆ తలుపును కొంచం వోరగానెట్టి, ఆ నాసికారంధ్రాల నుంచి ఒక పెద్ద పెనుతుపాన్ను లేవదీసేవారు. ఆ తుపానుకు—తలుపుమూలా, తెల్లటి గోడా, నల్లటి నాపరాయి,—కర్మంజాలక ఏ కుర్రాడన్నా ఆ ప్రాంతంలో వుండటం తటస్థిస్తే - వాడూ అంతా బలిఅయ్యేవారు ఆ తర్వాత, ఆ చేతికున్నది లాల్చీకి పులి మేసి ముక్కుని పంచె చెరుగుకు తుడిచే వారు. ఇలా అపరిశుభ్రంగావున్న వాళ్లకంటే మా హెడ్‌మాస్టరులాటివారు చాలా మెరు గనిపిస్తారు

ఈ రోజుల్లో జేబు రుమాలాలు కనపడని ప్రాంతాలు బహు అరుదు ఆడవారి చేతు ల్లోను, మొగవారి జేబుల్లోను వాటకి ప్రత్యే కస్థానం ఏర్పడింది. పేరంటాల మొదలు పెళ్లిళ్లవరకూ అవి లేందే సాగదు. మామూలు కలహాల మొదలు ప్రణయకలహాలవరకూ వాటి ప్రభావం, పలుకుబడీ కొట్టవచ్చినట్లు కన బడుతుంది

ఉదాహరణకి—ఒకసారి ఒక చిన్న సంఘటన జరిగింది ఆరోజు సాయంత్రం ఏంతోచక అలా బీచికి షికారుకెళ్ళాను. అక్కడ నాకు ఇద్దరు తటస్థపడ్డారు. వాళ్లేదో విషయం తీవ్రంగా చర్చిస్తున్నారు. అన్నివిషయాలూ నాకు తర్వాత అవగత మయ్యాయి — వాళ్ళిద్దరికీ కలిపి ఒకతే ప్రియురాలు. వాళ్ళలో వాళ్ళకు ఒకరి మీద ఒకరికి ఏదో అనుమానమేగాని, అసలు వివరాలు ఎవరికీ తెలియవు. ఆరోజు వాకర్మ కాలి వాళ్ళిద్దరూ ముఖాముఖీ తటస్థ పడ్డారు. రెండవవాడు అసలు విషయం తేల్చేద్దామనో, ఏమో మొదటివాణ్ణి ఏవో అడిగేస్తున్నాడు; మొదటివాడు మాత్రం— ఎదటిమనిషిమీద అనుమానం వున్నా, సర్దుకు పోయే మనిషో, లేకపోతే ఆ ప్రియురాలికి వాడిమీదకన్నా తనమీదే ఎక్కువ మక్కువని వాడివిశ్వాసమో ఆ పరమాత్ము డికే తెలియాలి—తాపీగా సమాధానా లిస్తున్నాడు. అల్లా చెపుతూవున్నవాడు చెపుతూనే, ఆ ఎదటివాడు చూడకుండా మడతలతోవున్న జేబురుమాలా ఒకటి క్రింద

★ జి. శ్రీ హ

పడేసి అదికనపడకుండా దానిమీద తన బూటుకాలుపెట్టి తీరుబడిగా మాట్లాడు తున్నాడు. నేలేచిన వేళావిశేషం ఎటు వంటిదో, పాపం వాడు పొరపాటున క్రింద పారేసుకుని చూడకుండా తొక్కుతున్నా డనిపించింది. దాంతోటి నా మంచితనం తెలియబర్చడానికి పెదమనిషిలాగా వాళ్ళ సంభాషణలో కలుగజేసుకొని—"ఏమం డోయ్, మీ రుమాలా కిందబడింది. మీరు దాన్ని చూసుకోకుండాతొక్కుతున్నారు," అన్నాను అదో గొప్ప 'హీరో'లా పోజ

# ప్రేంధాయిని!



టి.. కాని వాడిమొహం చూసేసరికి
స్తా ఐ. పి. దాఖలుచేసిన వాడి పోజు
దిగింది! అల్లా నావంక చూస్తూవున్న
గా తమాయించుకుని, దటుక్కున వొంగి
లా చేతిలోకి తీసుకొని దులిపి ఏమీ
నివాడల్లే చూడటం ఆరంభించాడు.
ల్లో ఈ ముఖాల మార్పులు పరిస్థితులూ
నాకు అగమ్యగోచరం అయిపోయి
నాలకా ఆ టైముకు నా ముఖం ఆ

8 ★

మాలా తెల్లదనంతో పోటీచేస్తూ
డొచ్చు.

"ఆ ఇది దాన్దే" అన్నాడా రెండో
దాన్ని చూచిన వెంటనే.

"ను దాన్దే ఇక్కడికెల్లా వచ్చింది?
మైనా తీసుకొచ్చావా?" అన్నాడు
దటివాడు ఏమీ ఎరగనట్టు.

అయిందిరా భగవాన్ దీంట్లో ఏదో
ణయ రహస్యం దాగివుంది; ఎరక్కపోయి
కు ఇరుక్కున్నాననుకుంటూ వుండగానే:

"ఛట్.. అబద్ధం ఆడావు. నీ జేబులోంచి
పడ్డదని ఆ పెద్దమనిషి చెపుతూంటే"
అన్నాడు నవ్వాసరా చేసుకుని ఆ రెండో
వాడు; నా పెద్దమనిషితనం చట్టుబండలు
గాను నిజమైన పెద్దమనిషిలాగా వెళ్లి వారిద్ద
రికీ లడాయి పెట్టానేమిటా అనుకున్నాను.
ఇంతలో:

"ఏమయ్యోయ్"...అని సంబోధించాడు
(వెధవ సంబోధన వీడూను) వాడికి ఎంత
కోప మొస్తేమటుకు అలాగా పిలిచేది! కాని
అది నాకు మంచిరోజు కాదుగాబట్టి నోరు
మూసుకు పూరుకున్నాను.."నా జేబు
లోంచి పడ్డదా? నిజంగా నువ్వు చూశావా?"
అని పూర్తిచేశాను.

నా పని పచ్చివెలక్కాయ గొంతు కడ్డం
పడ్డట్టయింది! ఏదో లౌక్యంగా తప్పుకోవా
లని "అబ్బే. ఆ రుమాలా ఎక్కడనుంచి
పడ్డదో నేనయితే చూడలేదుగాని, ఆయన
తీక్కడంమాత్రం చూశాను" అన్నాను.
ఏదో సమాధానం దొరికినందుకు దేవుడికి
మనస్సులోనే ఒక నమస్కారం పెట్టు
కున్నాను.

దానిమీద ఇంకా వాళ్ళిద్దరో ఇంకాసేపు
గుంజుకున్న తర్వాత దాని సంగతి తర్వాత
తేలుద్దామనుకున్నాడో ఏమో ఆ రెండో
వాడు అక్కడనుంచి కస్సుబుస్సుమంటూ
వెళ్ళిపోయాడు.

మొదటివాడుమాత్రం తిన్నగా పోక,
"ఏమయ్యోయ్! ఇలాటి వ్యవహారాల్లో
కలగజేసుకుంటే మర్యాద దక్కద"ని గద్దించి
వెళ్ళిపోయాడు. భగవంతుడి దయవల్ల ఇంత
టితో పోయిందని సంతోషించి బయటపడే
సరికి తలప్రాణం తోకకొచ్చింది! ఇదంతా
ఆ జేబురుమాలా మూలంగానే వచ్చిందికదా
అనుకున్నాను. ఇప్పటికీ, ఆ రుమాలా ఒక
మూల వ్రాసివున్న ఏవో అక్షరాలు—(అవి
ప్రేయసీప్రియుల పేర్లుగాబోలు)—ఇంకా
కళ్ళలో మెదుల్తూవున్నాయి!

ఈలాటివి ప్రపంచంలో ఏ మూలనో
ఓమూల జరగడం కద్దు.

నవలల్లో హంతకులు ఎవరినైనా
ఎత్తుకుపోయేముందు, క్లోరోఫారం వాసన
చూపడానికి అనువైనసాధనం జేబురుమాలా!

ప్రియుడు ప్రియురాలికిగాని, లేక ప్రియు
రాలు ప్రియుడికిగాని కానుకగా చదివించు
కోడానికి తేలికవస్తువు జేబురుమాలా!

రోడ్డు రోమియోల (ఆ మధ్య ఏవనితో
పేర్కొన్నట్టు) చేతుల్లోనో, లేక కాలర్ వ
మెడకు మధ్యగానో కనబడే వస్తువు జేబు
రుమాలా!

షోకిల్లా స్త్రీటుజాలియట్లు (ఓ పెద్దమనిషి
ఆ మధ్య పేర్కొన్నట్టు) తమ మూతికి
అడ్డంగా పెట్టుకునో, లేక చేతులో ఊపు
తూనో ప్రదర్శించే విలాస వస్తువు జేబు
రుమాలా!

సైకిలు తొక్కుతూ తెల్లపాంటు ఎక్కడ
మాసిపోతుందోనని సీటుమీద ఒకటీ, శ్వేద
బిందువులతో ముఖం ఎక్కడ జిడ్డోడు
తుందోనని జేబులో మరొకటి పెట్టు ఆప్త
బాంధవి జేబు రుమాలా! శ్రావణ మాసంలో
పక్కింటి పేరంటానికి వెళితే వాళ్ళిచ్చే
శనగలనూ, అరటిపళ్ళనూ భద్రంగా మూట
కట్టి తెచ్చుకోడానికి పనికివచ్చే అమూల్య
సాధనం జేబు రుమాలా! వెంట వచ్చే ప్రతి
పిల్లకూ ఒక్కొక్క జేబు రుమాలా అంట
కడితే ప్రతిఫలం ఇబ్బడీ, ముబ్బడీ!

ఇలా అనేక విధాలుగా మన చేతిగుడ్డల
ప్రాముఖ్యం పెరిగిపోయిందని వేరే
చెప్పాలా?

రుమాలా జేబులో వుందనుకుని అలా ఏ
పార్కులోకో షికారు కెళ్లేటప్పుడు ఏ వేరు
శనక్కాయల బండో, బఠానీల బండో,
కనబడితే, పార్కులో కాలక్షేపం కోసం
మూడు నయాపైసలు పారేసి అవి కొను
క్కుందా మనుకుంటే జేబులో రుమాలా
లేకపోతే ఎంత ఆశాభంగం చెందుతామో
ఊహించండి!

అలాంటి పరిస్థితిలో పక్కనే ఏ చేనేత
వస్త్రాలయమో కనబడితే వెంట నేదూరి అమాం

# ★ ఆపద్బాంధవి! ఆప్తసంధాయిని! ★

తం ఏ డజనో, అరడజనో రుమాళ్ళు కొనుక్కొని అనుకున్నపని ముగించేవాళ్ళుకూడా ఈ రోజుల్లో చాలామంది వున్నారు. తన రుమాలా అయితే ప్రాణప్రదంగా చూసుకుంటూ, అదే ప్రియురాలి మహాప్రసాదం అయితే మరింతగా జాగ్రత్తపడే పైమెట్టు పెద్దమనుషులూ వున్నారు.

అసలు జేబురుమాలాల ఆరంభం ఏ దేశంలోనో, దాన్ని కనిపెట్టింది ఎవ్వరో, పుట్టుపూర్వోత్తరాలేమిటో.. ఈ వివరాలన్ని ఆలోచించే ఓపికగాని, పరిశీలించే శక్తిగాని నాకు లేదు. కాని నేను చెప్పేదేమంటే... ఎప్పుడైతే ఈ నాసికాచూర్ణం ఉద్భవించిందో, దానివెనకాలే అది ఆవిర్భవించి వుంటుందని నా నమ్మకం. రెంటికీవున్న అవినాభావ సంబంధం అటువంటిది. మొదటి రోజుల్లో ముక్కులు, మూతులూ తుడుచుకోటానికి ఏ పాతగుడ్డ పేలికో జేబులో వేసుకోడంతో ప్రారంభం అయివుంటుంది దీనిగాథ.

దాని సరిహద్దులు సరిగా వుండకపోవడంచేత, జీవితం ఇట్టే హరించిపోతుందేమోనన్న భయంకొద్దీ దాని అంచులు కుట్టించే ఆచారం వచ్చివుంటుంది. తర్వాత క్రమేపీ పాతగుడ్డలకుబదులు, కొత్త గుడ్డలనుంచే ముక్కలు చించడం, వాటి అంచులు కుట్టించడం, ఆ అంచులనే రంగు దారాలో కుట్టి నగిషీ చేయించడం, మూలల్లో పేర్లు కుట్టించడం, మధ్యలో లతలు, పూలు కుట్టడం—ఇవేమీ సయించని శుద్ధ నిర్గుణ బ్రహ్మలు వూరికే అల్లా సాదాగా వదిలివేయడం - పద్ధతి అయింది. వీటిలోనే లేడీ ఫాషన్లూ, జంటిల్‌మన్ ఫాషన్లూ అవతరించాయి.

ఈవిధంగా ఈనాడు జాతీయ, అంతర్జాతీయ ప్రజాజీవితంలో ప్రముఖస్థానము పొందుతున్నది జేబురుమాలా. జేబు రుమాలాలను ఇంట్లో పదిమంది వాడడం ఎప్పుడైతే ఎక్కువైందో, చాకిరేవుకేసే గుడ్డల జాబితాలో వాటికీ ప్రముఖస్థానం లభ్యమైంది.

షాపుల్లోకి వెళ్ళి, చీరలు పంచలూ, ఉత్తరీయాలు, చొక్కాగుడ్డలు, లాగూ గుడ్డలూ కొనదలచిన వాళ్లు చివరిబేరంగా జేబు రుమాళ్ళనుకూడా కొనకుండా వుండరు.

కొంచెం దూరంగా వున్న మేడలలోంచి "నేనిక్కడ, నువ్వక్కడా హా, హతవిధీ" అని బాధపడే ఇద్దరు ప్రణయజీవుల మధ్య రాయంచల్లాగా రాయబారాలు నడుపుతూ సాంకేతికాలు అందజేస్తూ తెల్లగా వాళ్ళ చేతులలో అలాఅలా వూగుతూ మూగసంభాషణలు చేయించే పుణ్యం ఈ జేబు రుమాళ్ళకే దక్కింది.

రైల్వే ప్లాటుఫారాల మీద రైలు కదిలే సమయంలో ఒకసారి కిందికీ మీదికీ పరికిస్తే చాలు—ఈ రుమాలాల ప్రాధాన్యం అర్థమవుతుంది. అప్పటివరకు ఎదురెదురుగా వున్న ఇద్దరు ఆప్తులను అకస్మాత్తుగా వేరుచేస్తున్న బండగుండె రైలుబండిబయల్దేరినతరువాతకూడా నిమిషాలపాటు వాళ్ళహృదయాలను మహాగాఢంగా బంధించివేయగలిగిన మహద్భాగ్యం వీటికే దక్కింది.

సినిమాహాల్లో కూచుంటే (ముఖ్యంగా వేసంగిరోజుల్లో..) జేబురుమాలా ఉపయోగం ఇంతింతని చెప్పడానికి వీల్లేదు. అదే మనదగ్గర లేకపోతే, హాల్లో కూర్చునే ప్రాప్తివుండదు. ఒకవేళ మొండికెత్తి కూర్చున్నా సినిమా పూర్తయేసరికి నీళ్ళు గారుతూ జీవచ్ఛవంలా బయటపడవలసిందే. ముందు జాగ్రత్తపడి ఒక రుమాలా జేబులో వేసుకుని హాల్లోకివెడితే, అటు విసురుకోడానికి, ఇటుతుడుచుకోడానికీ, ఇంటర్వెల్‌లో బయటికి వచ్చినప్పుడు ఏ కాలక్షేపం బటానీలో కొనిపోసుకోడానికి ఇలాగేఎన్నెన్నో అవసరాలకు ఆప్తబాంధవిలా ఉపయోగపడుతుంది.

ఆనాడు శ్రీకృష్ణభగవానులు భార్యారత్నాలతోకూడి చెలాకీగా చెరకువిందు చేసుకుంటూన్నప్పుడు పొరపాటున చేయి తెగితే అదేసమయానికి పేరంటం పిలవడం కోసం (ఆయన్ని కాదు) అక్కడకు విచ్చేసిన ద్రౌపది ఆ దృశ్యంచూసి అమాంతం తన విలువైన చీరచెరుగు చించి ఒక పేలికను కృష్ణుడి వేలికి చుట్టింది!

ఆరోజుల్లోనే ఈ జేబురుమాలపద్ధతి వున్నట్లయితే ఈలాటి ప్రథమచికిత్సలకు అక్కరపడడమేగాక పండంటి ద్రౌపతి చీర అలా పాడైవుండేది కాదుగదా అనిపిస్తుంది.

దానాలన్నింట్లోకి అన్నదానం, వస్త్రదానం చాలా గొప్పవని మన పెద్దలంటారు. ఈనాటి పెళ్ళిళ్ళలో అన్నదానం కొద్దో గొప్పో ఎలాగూ జరుగుతోంది. ఈ జేబు రుమాలాలు వస్త్రదానం సమస్యనుకూడా కొంతవరకు తీర్చేస్తున్నాయి. కర్పూరపు కడ్డీలతోపాటు చేతిరుమాళ్లుకూడా పంచిపెట్టడం పరిపాటయింది.

ఇలాగా ఈ రోజుల్లో జేబురుమాలా మంచికీ చెడుకూ మనకు బాగా ఆసరా అవుతున్నది. దాని ముఖానే ఇంత సెంటు కొడుతున్నాం; దానిముఖానే ఇంత నాసికాచూర్ణంకూడా కొడుతున్నాం! దాంతోనే ప్రియులమధ్య ప్రణయాలు సాగుతున్నాయి; దాంతోనే ప్రియులమధ్య కలహాలు సంప్రాప్తమవుతున్నాయి! ఇలా జేబురుమాలా అన్నది రకరకాలగా ఉపయోగపడుతున్నది.

ఈరోజు అది కనపడని తావులేదు. బీచిలో, పార్కులో, ప్లాట్‌ఫారంమీద, సైకిల్‌పందాల్లో, గుర్రపుపందాల్లో శ్రావణమాసం పేరంటాళ్ల చేతుల్లో,-ఇంకా ఇంకా అనేక స్థలాల్లో ప్రత్యక్షమవుతున్నది.

ఇలాగా ఉడతాభక్తిగాగాని, ఉన్నతస్థాయిలోగాని ప్రజానీకానికి తరతమ భేదం లేకుండా అన్నివిధాలా ఆసరాగా వుండి ప్రపంచాన్ని ముందుకు తీసుకువెళ్ళడానికి జేబురుమాలాతోడ్పడుతోందని నావిశ్వాసం.

దీన్ని గురించి ఇంత వివరించేసరికి నా నుదురంతా చెమటతో తడిసిపోయింది...ఉండండి రుమాలాతో తుడుచుకోస్తా! ★

# ఋణానుబంధరూపేణ

అప్పుడే అందిన ఇంటర్వ్యూ కార్డుచూచి భావగర్భితంగా, వ్యంగ్యంగానవ్వాడు రామం. తనకువచ్చిన ఇంటర్వ్యూ కార్డులలో యిదిఎన్నవది? తను ఇప్పుడు వెళ్ళబోతున్న ఇంటర్వ్యూ, అంకెల వరుసలలో పడుతుందా! లేక సంఖ్యలవరుసలలో పడుతుందా? ఇంటర్వ్యూ కార్డువైపు పరీక్షగా చూశాడు "ఫలానా రోజు, ఫలానా సమయానికి, సర్టిఫికెట్లతోసహా, ఫలానా ఆఫీసరు వారివద్ద హాజరు కావలయును" తను ఇదివరకుచూసిన ఆఫీసర్ల జాబితాలో, ఈ ఆఫీసరుకూడ చేరబోతున్నాడు. అదృష్టవంతుడు .మళ్ళీ నవ్వాడు.

"అదేమిటిరా! అలానవ్వుతావు" అంది తల్లి వింతగాచూస్తూ.

"అబ్బే!ఏమీలేదే! ఇది ఎన్నవదా అని ఆలోచిస్తున్నాను సరే రేపేకదా వెళ్ళి, అదేమిటో చూసుకువస్తాను. ఇంతకు పూర్వం ఎన్ని చూడలేదు అందులో ఇది ఒకటి" అన్నాడు రామం.

రామం బి ఎ ప్యాసయాడు విశ్వవిద్యాలయం ప్రసాదించిన దళసరిపాటి డిగ్రీకాగితం పుచ్చుకొని, ఉద్యోగాన్వేషణరంగంలో అడుగుపెట్టేడు రామం తండ్రి ఏదో ఆఫీసులో ఉద్యోగంచేసి, ప్రస్తుతం, విశ్రాంతితీసుకున్నాడు మధ్యతరగతి కుటుంబం ఆస్తీలేదు, అప్పులేదూ అన్నరహాకు చెందిన జీవితం కష్టపడి, కొడుకును బి. ఏ. ప్యాసుచేయించి, ఉద్యోగంకోసం ప్రపంచంపై వదిలివేశాడు.

రామం, ఊళ్ళోఉన్న అన్నిఆఫీసులకు ఉద్యోగంనిమిత్తం, దరఖాస్తులు పంపాడు. అనేక ఆఫీసులకు ఇంటర్వ్యూల నిమిత్తం వెళ్ళాడు. సర్వీసు కమిషన్ పరీక్షలకు కూర్చున్నాడు. కాని ఫలితం శూన్యం. ఇంటర్వ్యూలలో, పరీక్షలలో అడిగిన ప్రశ్నలకు తృప్తికరంగానే జవాబు లిచ్చేవాడు. కానిసదరు ఉద్యోగం, అప్పటికే ఏ ఆఫీసరుగారి బావమరదికో, లేక వారిబంధుకోటిలోని ఏ అదృష్ట వంతునికో నిశ్చయమైపోయేది. ఇంటర్వ్యూ ఒక ఆచారం కాబట్టి వారది జరిపేవారు. ఇంటర్వ్యూ కార్డు, వారు పంపేవారు కాబట్టి తను వెళ్ళేవాడు. అంతే, అంతకన్న ఇంకేమీ ఫలితం కనుపించలేదు.

'ఊళ్లో ఉన్న ఆఫీసు కదా! వెళ్ళి ఆ యింటర్వ్యూ కూడ చూద్దాం' అని రామం మరునాడు, 'ఆ' ఆఫీసుకు వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు.

* * *

మరునాడు, రామం, యథాప్రకారం, కాలకృత్యాలు తీర్చుకుని, ఇంటర్వ్యూ కార్డు, ఎస్. ఎస్. ఎల్. సి. రిజిస్టరు, డిగ్రీ, తదితర సర్టిఫికెట్లు, జాగ్రత్తగా పెద్ద కవరులో పెట్టి, ఇంటర్వ్యూకు వెళ్ళడానికి సిద్ధమయాడు.

"ఎదురు మంచిది చూసుకు మరీ వెళ్లరా!" అని తండ్రి హెచ్చరించాడు.

"లక్ష్మీ! అన్నకు ఎదురు రావే" అని కూతుర్ని ఎదురు పంపింది రామం తల్లి.

---

## టి. సోమలింగం

---

"అబ్బ! ఏమిటే యీ గొడవ" అంటూ రామం, చెల్లెలు ఎదురు రాగా, మెట్లు దిగాడు నవ్వుకుంటూ.

'అన్నయ్యా, ఉద్యోగం అవగానే నాకు మంచి ప్రెజంట్లు యివ్వాలి తెలిసిందా?" అని లక్ష్మి మెట్లుదిగిన రామాన్నుద్దేశించి గట్టిగా అన్నది

"సరే లేవే. అలూలేదు. చూలూలేదు, కొడుకు పేరేమిటో"అన్నట్లు, దీనికి అప్పుడే ప్రెజంటు" అన్నాడు నవ్వుతూ వెనక్కు తిరిగి.

'ఆగకు! వెళ్లు' అని హెచ్చరించింది తల్లి. రామం ఆఫీసు దిక్కుగా నడక సాగించాడు.

* * *

నియమిత కాలానికి రామం ఆఫీసుకు చేరుకున్నాడు. అప్పటికే ఒకడజను మంది అభ్యర్థులు ఆఫీసు వరండాలో, ఒక బెంచి మీద, ఒకరివైపు ఒకరు చూచుకుంటూ కూర్చున్నారు అదృష్టులు వివిధ భావాలను వ్యక్తం చేస్తున్నాయ్ నాటి ఉద్యోగానికి అన్నివిధాలా 'తను' సరియైన అభ్యర్థిని అన్న భావం, ప్రతివాని కండ్లలోను ద్యోతకమవుతోంది. మిగిలినవారందరూ తనపై పోటీకి వచ్చారన్న భావంతో ప్రతివాడు, ఎదుటివాడిని చూస్తూ, అసహనంతో కూడిన అసహ్యతను వ్యక్తం చేస్తున్నారు. కొందరు "హిందుస్థాన్ హేండ్ బుక్" మరికొందరు, 'జనరల్ నాలెడ్జి' వగైరాపుస్తకాలను తీక్షణంగా చదివేస్తున్నారు కొంతమంది ఇంటర్వ్యూపద్ధతులను, యింటర్వ్యూలలో వారి వారి అనుభవపరంపరలను, జాగ్రత్తగా అనుభవం లేని అభ్యర్థులకు చెప్తున్నారు.

రామం మెల్లిగావెళ్ళి ఆ బెంచి చివర కూర్చున్నాడు. రామం కూర్చోగానే, అక్కడున్న అందరి దృష్టులు రామం వైపు ఒక్క క్షణకాలం పాటు కేంద్రీకరించబడ్డాయి. తిరిగి, ఎవరిపనిలో వారు నిమగ్నులైపోయారు. రామం ఎవరితోనూ, మాట్లాడకుండానిశ్శబ్దంగా. ఎవరెలా పోతేనాకేం అన్నట్లు కూర్చున్నాడు.

ఇంతలో ఆఫీసరుగారు అభ్యర్థులను ఒక్కొక్కరినే పంపమని ఆఫీసు జవానుకు ఆర్డరు వేశారు. ఆ ఆర్డరు, అభ్యర్థుల నందరిని ఒక్క తిత్తపాటులో, ఎటెన్షన్ లోకి రప్పించింది.

రుమాళ్లతో మొహాలు శుభ్రంగాతుడుచుకోవడం, దుస్తులు, ఎక్కడా నలగకుండా సర్దుకోవడం, జేబుల్లోంచి దువ్వెనలు తీసి శిరోజసంస్కారం చేసుకోవడం, కాలరు, ఎత్తుకోవడం, దించుకోవడం, ఒక్కటేమిటి వివిధ కార్యక్రమాల్లో మునిగిపోయారు అభ్యర్థులందరూ ఒక్క క్షణంపాటు.

ప్యూను, ఒక్కొక్క అభ్యర్థిని వరుస క్రమంలో పిలుస్తూ ఆఫీసరుగారి గదిలోకి ప్రవేశ పెడుతున్నాడు.

కొందరు టకటక నడుస్తూ, ఆఫీసర్లా వెళుతున్నారు. కొందరు జంకుతూ భయంగా, అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వెళుతున్నారు. ఏ విధంగా వెళ్ళినా, దీనవదనాల్తో, నిరాశగా నిట్టూర్పులు విడుస్తూ తిరిగి వస్తున్నారు. ప్యూను రామాన్నికూడ పిలిచాడు. సర్టిఫికెట్లసంచి పట్టుకుని రామం, ఆఫీసరు, సముఖానికి వెళ్లాడు.

ఆఫీసరు, ఏ శైశవ పడిలో పడిన [illegible]

# ★ ఋణానుబంధ రూపేణ.... ★

గంభీరమైన స్థూల విగ్రహం. బొద్దుగా పెరిగిన మీసాలు. కళ్లద్దాలలోంచి, నిశితంగా వెలువడుతున్న దృష్టులు రామానికి కొంచెం జంకును కలిగించాయి. వినయంగా నమస్కారం చేసి నిలువబడ్డాడు.

"నేమ్—ప్లీజ్!" అన్నాడు ఆఫీసరు.

"రామానంద రావు."

"నీ క్వాలిఫికేషన్?"

"బి. ఎ. ప్యాసయానండి."

ఆఫీసరు ఒక్కసారి రామంవైపు చూసి, సర్టిఫికెట్లు చూట్టంలో నిమగ్నుడయాడు. రామంవైపు ఒక్కసారి ఆప్యాయంగా చూసి, "కూర్చో అబ్బాయ్" అన్నారు.

రామం కుర్చీలో వినయంగా కూర్చున్నాడు.

"చూడు. రామానందరావ్. మీదేవూరు" అని వాత్సల్యంతో అడిగారు ఆఫీసరుగారు.

"ఈ వూరేనండి" అని జవాబిచ్చాడు రామం.

'మీ నాన్నగారేం చేస్తున్నారు'

"జుడిషియల్ డిపార్టుమెంటులో పని చేశారు. ప్రస్తుతం రిటైరై యింటిదగ్గరే ఉన్నారు" అన్నాడురామం, ఈ ప్రశ్నలు యిప్పటికి ఉద్యోగానికి ఏవిధంగా పనికి వస్తాయో తెలియక తికమక పడుతూ.

ఆఫీసరుగారు ఒక్కక్షణం ఆలోచించి, బుర్రతటపాయించి, "సరే! యీ ఉద్యోగంలో నిన్ను వేస్తున్నాను. జాగ్రత్తగా పనిచేయాలి. రేపు చార్జి పుచ్చుకోవాలి" అన్నారు.

రామం తన చెవులను తను నమ్మలేక పోయాడు. ఆఫీసరు ఏమిటంటున్నాడో, తనకు అర్థం కావడం లేదు. తనకు పెద్ద అనుమానం వేసింది ఇది కలా. .లేక నిజమా అయోమయంగా ఆఫీసరువైపు చూశాడు. ఆఫీసరు చిరునవ్వుతో రామం ముఖంలోకి చూశారు. రామం భక్తితో నమస్కారం చేసి, ఆయనవద్ద సెలవు పుచ్చుకుని బయట పడ్డాడు.

* * *

రామంకు ఆఫీసరుగారి ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది. తలవని తలంపుగా ఉద్యోగ మయింది తనకు. ఆఫీసరు వేసిన ప్రశ్నలు మరీ తనను ఆశ్చర్యంలో ముంచాయి. తన వూరు, తన తండ్రి ఉద్యోగ విషయం! ఇదీ ఆయన వేసిన ప్రశ్నలు. ఆనందంతో రామానికి ఆకాశ విహారం చేస్తున్నట్లనిపించింది.

ఆర్డర్లు సంతకాలు కావడం, ఆరరు కాపీ ఒకటి రామానికి యివ్వడం, అన్నీ నిమషాల్లో జరిగిపోయాయి. సమస్త దేవతలకు నమస్కారా లర్పించాడు. ప్రత్యేక నమస్కారా లర్పించాడు. ■ఫీసరుగారికి. ఆనందంగా, యింటివైపు నడక ప్రారంభించాడు.

* * *

ఆఫీసరుగారు బహు యోగ్యుడు. నెమ్మదస్తుడు. రామం ఉద్యోగంలో చేరిన నాటి నుండి, అతనిని ఒక ప్రత్యేక దృష్టితో చూడ నారంభించాడు. అతడు, కాగితాలు సంతకాలకు తీసుకువెళ్లితే, అతనితో కులాసాగా కబుర్లు చెప్పుతూ తను వ్రాసిన వాటిలో సవరణలు చేస్తూ, అన్ని కాగితాలమీద ఫేవర్ బుల్ గా ఆర్డర్లు వేసేవాడు.

ఒక్కొక్కప్పుడు ఆఫీసరు తీరుబాటుగా ఉన్నప్పుడు, రామంతో పాసు కొడుతూ కూర్చునేవాడు. ఆథోరణిలో ఆయన ■నేక విషయాలను చర్చించేవాడు. వాటిలో వివాహాలు, కట్నాలపద్ధతి, నేటి యువకుల వైఖరి మొదలైన విషయాలమీద ఉపన్యాసాలు దంచేవాడు.

రోజులు గడుస్తున్న కొద్దీ రామం, ఆఫీసరుగారికి చాల దగ్గర కాజొచ్చాగు.

ఒక రోజు ఆఫీసరుగారు రామాన్ని ఆప్యాయంగా అడిగారు "ఓయ్ రామం, నువ్వు సాయంకాలం వేళ ఏంచేస్తావు."

"అబ్బే! ఉద్యోగంలో చేరిన దగ్గరనుంచి సాయంకాలాలు పనేమీ లేదండి, ఏదో చదువుతూ కూర్చోవడంతప్ప" అన్నాడు రామం.

"సాయంకాలం వేళ నీకు తీరుబడే అన్నమాట. అయితే, చిన్న ఉపకారం చేసిపెడతావటోయ్" అని అడిగారు చిరునవ్వుతో.

"ఏమిటండీ ■ ఉపకారం" అన్నాడు రామం.

"అబ్బే మరేంలేదోయ్. చూశావూ. మా అమ్మాయి మెట్రిక్యులేషన్ పరీక్షకు వెడుతుంది దానికి ఇంగ్లీషు బొత్తిగాపూరోయ్. మేష్టర్లను పెడదామంటే, వాళ్లేమిటి చెపుతారో, వీళ్ళేమిటి వింటారో ఎవరికీ అర్థం గాదు. మరేంలేదు రోజూ సాయంకాలం, ఒకగంటసేపు దానికి యింగ్లీషు చెప్పేవా, దాని పరీక్ష గట్టెక్కుతుంది" అన్నారు ఆఫీసరుగారు.

రామం, ఆఫీసరుగారికోర్కె విని మొదట ఆశ్చర్యపోయాడు ఎదిగిన అమ్మాయికి,...అందులోనూ, ఆఫీసరుగారి అమ్మాయికి. ప్రైవేటు చెప్పడం .కాని ఆఫీసరు సరుగారి కోర్కె. కాదన లేకపోయాడు.

"సరే! దానికేముందండి, చెపుతాను" అన్నాడు రామం.

"అయితే, రేపు మంచిది రేపట్నుంచి మొదలుపెట్టు" అన్నాడు ఆఫీసరు

■ మరునాటి సాయంకాలం ఆఫీసునుండి, ఆఫసరుగారితో సహా వారింటికి వెళ్ళాడు రామం. ఆఫీసరుగారు యింట్లో అడుగు పెడుతూనే 'లలితా' అని పిలిచారు. లలిత తండ్రి పిలుపుకు హాల్లోకి వచ్చి, క్రొత్త వ్యక్తినిచూసి, సిగ్గుతో లోపలకు వెళ్ళిపోయింది.



నవకళా నికేతన్ (మద్రాసు) వారు ఇటీవల ప్రదర్శించిన "నిరాశ ప్రొడక్షన్ సెం. 1" అనే నాటకంలో శ్రీయుతులు సుబ్బరామయ్య, మద్దాలి రాధాకృష్ణమూర్తి, బి. రామకృష్ణ, సుబ్రహ్మణ్యం.

"అమ్మా! లల్లీ, ఈయనే మాష్టారు. ప్రొద్దుట చెప్పేను కదూ యిప్పుడు తీసుకు వస్తానని" అన్నారు ఆఫీసరుగారు లలిత సిగ్గుతో మేష్టారికి నమస్కరించింది

రామం లలితనుచూసి, ఒక్క క్షణకాలం పాటు దిగ్భ్రమచెందాడు చాల అందమైన అమ్మాయి లలిత. తెల్లటి దేహకాంతి, పెద్ద కళ్ళు, అందమైన నాసిక, తెల్లటి పలువరుస, దింటి బద్దలా వంగిన ఎర్రని పెదిమలు.. .. సర్వాంగసుందరమైన విగ్రహం.

రామం అనుకున్నాడు. 'ఈమెకా ప్రైవేటు..... తనకు సాధ్యమా' మనసుకు కళ్ళెం వేసి, దిటవుపరచుకున్నాడు.

ఇంతలో ఆఫీసరుగారి భార్యగారు హాల్లోకివచ్చి, రామాన్ని ఒకసారి తృప్తిగా చిరునవ్వులో, లోపలకు వెళ్ళి, కాస్సేపటికి కాఫీతో తిరిగివచ్చింది ఆఫీసరుగారు కాఫీ త్రాగుతూ అన్నారు "అమ్మాయికి యింగ్లీషులో ఫస్టుమార్కు వచ్చేటట్లు చెప్పాలి ప్రైవేటు."

లలిత పుస్తకాలతోసహా హాల్లోకివచ్చింది. ఆఫీసరుగారు లోపలకు వెళ్ళిపోయారు. హాల్లో, రామం, లలిత, పుస్తకాలు మధ్యన పేసుకుని మిగిలారు

రామం అంటుతూ, మెమ్మదిగా అడిగాడు, మెట్రిక్యులేషన్ పరీక్ష ఎప్పుడో, పుస్తకాల వివరాలు, ఎంతవరకు పాఠాలయాయో మొదలైన విషయాలు. సిగ్గుతో తలవంచుకుని రామం ప్రశ్నలకు జవాబులిచ్చింది లలిత

ఆరోజు, యింగ్లీషు వ్యాసాలు చెప్పి, ఒక పాఠం బోధపరచి, "మళ్ళీ రేపు సాయంకాలం వస్తానండి" అని చెప్పి, ఆఫీసరుగారిదగ్గర సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు.

* * *

ఏ రోజూ తప్పకుండా, ప్రతీ సాయంకాలం రామం, ప్రైవేటు చెప్పడానికి, ఆఫీసరుగారి యింటికి వెళ్ళేవాడు కాలం గడుస్తున్న కొద్దీ రామాన్ని ఇదివరకు ఆవరించి ఉన్న భయం, సిగ్గు క్రమంగా విడిపోయాయి రామం, ఆమెకు పాఠాలు బోధపరుస్తూ, అనేక విషయాలు గూర్చి, బహువిపులంగా, సులువుగా అర్థమయేటట్లు చెప్పేవాడు

లలితకూడ ఇప్పుడు పూర్వమంత సిగ్గుపడటం లేదు. తనకు అర్థం కాని వాటిని, అడిగి తెలుసుకునే స్థితిలోకి వచ్చింది.

పరీక్షలు దగ్గరపడుతున్నాయి చెప్పవలసిన కోర్సంతా జాగ్రత్తగా పూర్తి చేశాడు లలితకూడ అతను చెప్పినవన్నీ జాగ్రత్తగా అవగాహనం చేసుకుంది

ఆ రోజు సాయంకాలం, పాఠం ముగించి పరీక్షలగురించి, ఆమెతో చెబుతూ, "పరీక్షకు కూర్చోవడం ఇది మీకు మొదటిసారి కదూ! కొంచెం భయంగా వుంటుంది. కాని భయపడకూడదు. మొదట జాగ్రత్తగా ప్రశ్నాపత్రాన్ని చదవాలి తరువాత, మీరు ఆన్సరు చేయవలసిన ప్రశ్నలన్నింటినీ గుర్తుపెట్టుకొని గాభరా పడకుండా యిచ్చిన ప్రశ్నను అర్థం చేసుకుని సరియైన సమాధానం వ్రాయాలి అన్ని ప్రశ్నలకు సమాధానాలు వ్రాయాలి. కాని ప్రశ్నలు విడిచిపెటకూడదు."

"ప్రశ్నకు జవాబు తెలియకపోతే" అంది లలిత.

"ఛాయిస్ ఉంటుంది కదూ మీరు బాగా సమాధానం వ్రాయగల ప్రశ్నలనే ఎంచుకోండి" అన్నాడు రామం. లలిత ఏం మాట్లాడలేదు.

"మీరు జాగ్రత్తగా చదవండి ఎంత చదివినా యీ 15 రోజులే. నే వెళతానండి." అని రామం లేచాడు.

లలిత చిరునవ్వుతో అంది.

"మీరు ఎప్పుడు మాట్లాడినా, నన్ను "మీరు" అంటారేం. నన్నలా పిలవకండి"

"సరేలెండి! ఇకముందు అలా పిలవను" అన్నాడు రామం నవ్వుతూ, లలిత ముఖంలోకి చూస్తూ.

లలిత చిన్నగా నవ్వింది.

రామం ఇంటికి బయలుదేరాడు.

* * *

లలిత చిరునవ్వు రామం హృదయంలో హత్తుకుపోయింది. తను పాఠం చెపుతూ, ఎప్పుడైనా ఆమె ముఖంలోకి చూడ్డం, తటస్థిస్తే, ఆమె దృష్టులు, తనవైపే ఉండేవి తను ఆమెవైపు చూడగానే, ఆ అందమైన కళ్ళు. సిగ్గుతో క్రిందకు వాలిపోయేవి తనపై బహువచనం ప్రయోగించవద్దని ఎం ముద్దుగా చెప్పింది. అప్పుడెంత అందంగా నవ్వింది. ఒకవైపు ఆనందం. మరొకవైపు నిరాశ. లలిత తనకు భార్య అయితే.. తనెంత అదృష్టవంతుడు కాని అంత అదృష్టం తనకు ఉందా? ఆఫీసరుగారి హోదా చటుక్కున జ్ఞప్తికి వచ్చింది. తన ఆనందం ఒక్కసారి క్రుంగిపోయింది. భారంగా అడుగులు వేసుకుంటూ యిల్లు చేరుకుని, రెండు మెతుకులు కొరికి, మేను వాల్చాడు చిరునవ్వు చిందులాడే లలిత ముఖం తిరిగి తన భావతరంగాల మధ్య సాక్షాత్కరించింది. ఆ చిరునవ్వెంత అందంగా హాయిగా ఉంది.. ఆమె ఎన్ని సార్లు నవ్వలేదు కాని సాయంకాలం ఆమె నవ్విన నవ్వులో ఎంతో ప్రత్యేకత ఉంది." అని ఆలోచించుకుంటూ నిద్రపోయాడు రామం. మరునాడు యథా ప్రకారం ఆఫీసుకు వెళ్ళాడు. ఆఫీసరుగారు మధ్యాహ్నం రెండు, గంటలకే ఆఫీసునుండి వెళ్ళిపోయారు.

సాయంకాలం రామం తిన్నగా ఆఫీసరుగారి యింటికి వెళ్ళాడు. వైవరండాలో పూర్వను వెంకన్న కూర్చొని ఉన్నాడు. రామం హాల్లోకి వెళ్ళికూర్చొని, "వెంకన్నా! ప్రైవేటుకు రమ్మని చెప్పు" అన్నాడు.

రామం మాటలను విని లలిత గోలుగుమ్మం దగ్గరకు వచ్చి ఒక్కసారి చూచి, సిగ్గుతో ముఖం చేతులతో కప్పుకుని ముసిముసి నవ్వుతూ పారిపోయింది. రామం తెల్లపోయాడు. వృద్ధనౌకరు వెంకన్న కూడా ముసిముసి నవ్వులు కురిపించాడు.

రామం కొస్త తేరుకుని "వెంకన్నా ఆమెను రమ్మను" అన్నాడు.

వెంకన్న, రామం కళ్ళల్లోకి అదోలా చూసి, లలితను పిలవడానికి, లోపలకువెళ్ళి, కాస్సేపట్లో కాఫీ కప్పుతో తిరిగివచ్చి, "బాబూ! ఇవాళ చిన్నమ్మగారు చదుకోడానికి రారట" అన్నాడు. రామానికి ఏమీ అర్థంకాలేదు.

"అయితే సరే: నేను వెళతాను" అని లేచి నించున్నాడు. రామం లేచి నిలువబడగానే, ద్వారబంధం తెరనుండి లలిత ముఖం ఒకసారి కనపడి తిరిగి మాయమయింది. రామం ఒక్క క్షణం, ఆశ్చర్యంగా అటువైపు చూసి, హాలునుండి బయటకు వెళ్ళిపోయాడు.

# ★ ఋణానుబంధరూపేణ.... ★

రామం యింటికి వెళుతూంటే దారిలో, జట్కా బండిలో వస్తూ ఆఫీసరుగారు, ఆయన భార్య కనుపించారు. రామాన్ని చూడగానే ఆయన జట్కా ఆపించి, "ఏమోయ్ రామం! ఇంటికివెళ్ళేవా?" అని ప్రశ్నించారు నవ్వుతూ.

"వెళ్లేనండి ఇవాళ ప్రైవేటు అక్కర లేదని వెంకన్నతో కబురు పంపించారు. ఇంటికి వెళ్లి పోతున్నాను" అన్నాడు రామం.

"సరేలే...ఆఁ. చెప్పడం మరచిపోయాను. రేపు లలిత పుట్టిన రోజు. నీవు మా యింటికి తప్పకుండ భోజనానికి రావాలి" అని ఆఫీసరుగారు రామం ముఖంలోకి చూస్తూ నవ్వుతూ అన్నారు.

"తప్పక వస్తానండి" అని రామం ఆయన దగ్గర సెలవుపుచ్చుకొని యింటి ముఖంగా నడిచాడు.

* * *

ఇంటికి చేరుకునే సరికి రామానికి ఎదురైంది అతని చెల్లెలు లక్ష్మి. రామాన్ని చూడగానే లక్ష్మి మొహం ఆనందంతో విప్పారింది.

"ఏం అన్నయ్యా! ఇప్పుడు నువ్వు మీ ఆఫీసరుగారి యింటిదగ్గరనుండేనా రావటం" అంది చక్రాల్లా కళ్ళు త్రిప్పుతూ—

"ఆఁ. ఏం?" అన్నాడు రామం.

"అబ్బే! ఏంలేదు. పాఠాలు ఎలా సాగుతున్నాయా...అని" దీర్ఘాలు తీస్తూ అంది లక్ష్మి.

"ఎలాగో, అలాగ సాగుతాయిలే నీకెందుకు మధ్యన" అన్నాడు చెల్లెలు ఛలోక్తికి చిరాకుగా.

"ఓ యబ్బో! ఫో. పోనీ కదా, పాఠాలు చెప్పడానికి నీ వెంత బాధపడుతున్నావో అని అడిగితే అంత కోపం రావాలా", అంది మూతి ముడుచుకుని.

"ఏం బాధలు లేవులే, భష్టుగా సాగుతున్నాయ్" అంటూ తన గదిలోకి వెళ్ళబోతుంటే తల్లి ఎదురైంది.

ఏఁరా నాన్నా! యింత వేగిరం వచ్చేవు యీ వేళ. ఎనిమిదింటికి కాని వచ్చేవాడివికావే" అంది చిఱునవ్వుతో.

"అబ్బాయొచ్చాడా" అంటూ రామం తండ్రి కూడ అక్కడకు వచ్చాడు.

[illegible] రోజు ఏమిటో యింట్లో నవచైతన్యం గోచరిస్తూంది రామానికి.

లక్ష్మి అంది. "అన్నయ్యా, ఇవాళ మీ ఆఫీసరుగారు మనింటికొచ్చారు."

"మనింటికా! ఎందుకేమిటి?" అన్నాడు రామం.

"ఏదో పెద్ద గొడవవుందిలే. మధ్య నీకెందుకు." అంది లక్ష్మి పెద్ద వ్యవహర్తలా మొహంపెట్టి.

"ఎందుకమ్మా! ఆయన వచ్చాడట," అన్నాడు రామం తల్లి నుద్దేశించి.

కొడుకు ముఖంలోకి ఒక్కసారిచూచి ఆమె అంది. "కూతురుపెళ్ళి విషయం మాట్లాడ్డానికి వచ్చారు."

"ఆయన కూతురు పెళ్ళి విషయానికి మనింటికి రావడమెందుకు." అన్నాడు రామం అర్థంకాక.

"ఓస్, అబ్బాయిగారికి అరటిపండు వొలిచి చేతిలోపెట్టినట్లు చెప్పాలి గాబోలు. పెద్ద చదువు చదివాడు. ఆపాటి అర్థం చేసుకోలేడు"

"అబ్బ. నువ్వుండవే, మధ్య నువ్వెక్కడ దొరికావు మాకు" అన్నాడు కోపంగా రామం.

రామం తల్లి అంది. "వాళ్లు లలితను నీకిస్తామని అడగడానికి వచ్చారు."

"లలితనా! నాకా!!" అన్నాడు రామం ఆశ్చర్యంతో, ఒక్కసారి సాయంకాలం లలిత ప్రదర్శించిన సిగ్గు జ్ఞప్తికి తెచ్చుకుంటూ.

"ఇప్పుడు అర్థమయింది అబ్బాయిగారికి" అంది లక్ష్మి వెక్కిరింపుగా.

రామంతల్లి అంది "నీకుద్యోగం యిచ్చేటప్పుడే, నీ ఎస్. ఎస్. ఎల్. సి. రిజిష్టరులో మన కులం చూశారట ఆయన. ఆయనకు కావలసిన గుణాలన్నీ నీలో ఉన్నట్లు అప్పుడే కనిపెట్టేరట. వెంటనే నీకుద్యోగం వేశారట. లలితకూడ నువ్వంటే యిష్టపడిందట. ఈ వేళ మంచిరోజు కాబట్టి, యీ విషయం మాట్లాడడానికి వచ్చినట్లు ఆయన చెప్పారు.

"మీ రేమన్నారు" అన్నాడు రామం తల వంచుకుని.

"మే మేమన్నాం? వాడికి యిష్టమైతే మాకూ యిష్టమే అన్నాము" అందిరామంతల్లి.

రామం కళ్లు ఆనందంతో తళుక్కుమన్నాయి.

"ఏమిరా అన్నయ్యా! నీకిష్టమేనా? లేకపోతే ఖచ్చితంగా చెప్పు. మీ ఆఫీసరని భయపడకు" అంది లక్ష్మి

పోవే. ఎప్పుడూ ఒకటే అల్లరి" అంటూ తన గదిలోకి వెళ్ళిపోయాడు రామం ఆనందంతో. ★

ఉత్కళ దేశంలో

# కార్తిక పౌర్ణమి

★

ఏ. సీత

(కటక్, ఒరిస్సా)

దీపావళి అమావాస్య వెళ్ళింది. రాబోయే పౌర్ణమి 'కార్తికపౌర్ణమి' అని ప్రసిద్ధి. ఈ కార్తికపౌర్ణమి రోజునే కళింగదేశం (ఒరిస్సా) ముఖ్యపట్టణమైన కటికర్దమ్ (కటక్) లో భారిఎత్తున ఉత్సవాలు జరుపుతారు. ఈ వుత్సవాలు ఎందుచేత జరుపుతారు? ఎలా జరుపుతారు?

పూర్వం తెరచాపల సహాయంతో, నౌకలు ప్రయాణం చేస్తువుండేవి. సాధారణంగా ఆషాఢంనుండి కార్తికం వరకు నైరృతి దిక్కునుండి గాలి వీస్తుంది దీనిని (యీగాలిని) మాన్సూన్ విండ్ అంటారు. నైరుతి ఋతుపవనాలన్న మాట. ఈ సమయంలో కళింగదేశపు నదులన్నీ జలపూరితములై వుంటాయి. అందువల్ల కళింగదేశపు వర్తకులు, నావికులు జావా, సుల్కా, సింహళ తదితర దేశాల్లో వర్తకంచేసి ఈ సమయంలో వుత్తర దిక్కుకు ప్రవహించే గాలి (Monsoon winds) సమయంతో తిరిగివచ్చేస్తు వుండేవారు నదిజల పూరితమైవుండుటవల్ల ఓడలన్నీ దేశంలోకి రాగలుగుతుండేవి జావా, సింహళ దేశాల్లో వర్తకం కొరకువెళ్ళిన ఓడలు తిరిగి వచ్చుటకు మూడునాలుగు నెలలు గడిచేవి. అనగా అటుఇటుగా కార్తికమాసంలో వర్తకులు స్వదేశం చేరుకునేవారు. ఓడలు తిరిగిరాగానే గృహిణిలు వారికి స్వాగత పూజలు, జరిపి, భర్తలు వర్తకంచేసి తెచ్చిన ద్రవ్యాల్ని యిండ్లలోపలికి తెచ్చుట కళింగదేశంలో పూర్వంనుండి వచ్చుచున్నది. బహుశ ఈపనికొరకు కార్తిక అమావాస్య శుభదినంగా నిర్ణయింపబడింది. ఆరోజు పితృశ్రాద్ధం అవుతుంది. శ్రాద్ధం తరువాత గృహిణిలు ప్రొద్దుటే లేచి తిరిగివచ్చిన ఓడలకు స్వాగతపూజలు జరుపుతుండే వారు.

ఈనాడు వుత్కళంలో నౌకవాణిజ్యం కేవలం చరిత్రక్రిందమారినా, ఉత్కళ గృహిణిలు కార్తిక అమావాస్య నాటిరాత్రి తమ తమ గృహ ప్రాంగణాల్లో ఓడల చిత్రాలువ్రాసి, ఇండ్లలో ఉండేద్రవ్యాన్ని ఆ చిత్రాలమీద వుంచి తెల్లవారగానే స్వాగత పూజలుజరిపి యిండ్లలోకి తీసుకువస్తారు.

ఓడలన్నీ జావా, సింహళ దేశాల్లో వర్తకంచేసి ఆషాఢంనుండి కార్తికం మధ్యలో తిరిగివచ్చేస్తు వుండేవి. కాని అవి ఎప్పుడు ప్రయాణంచేసేవి? అన్న సమస్య కూడా తీర్చడానికి ఎన్నో నిదర్శనాలు వున్నాయి.

మార్గశిరంనుండి చైత్రం వరకు కొన్ని నెలలు ఈశాన్యదిశనుండి గాలి వీస్తుంది. ఈ గాలి సహాయంతో నావికులు వర్తక నౌకల్ని వదలడం సహజం కార్తిక పౌర్ణమునాటి తెల్లవారుజాము యీ రకపు జలయాత్రకొరకు తగినదని స్థిరపర్చబడింది.

కళింగదేశపు నావికుడు కార్తిక పౌర్ణమి నాడు తెల్లవారగానే లేచి, స్నానాదులు ముగించి, కళింగదేశపు తమలపాకులు యిచ్చి జావా తదితర ప్రాంతాలనుండి ఏవక్కలు పుచ్చుకుంటాడో ఆ వక్కా, ఆకు గంగామాతకి సమర్పించి తన వర్తకనావని తీసుకుపొయ్యేవాడు. నౌక ఒడ్డునుండి బయలుదేరుతున్నపుడు ఆత్మీయులకి వీడ్కోలులు చెప్పుతూ, "ఆ, కా, మా, వై" అనేవాడు. అనగా ఆషాఢంనుండి కార్తికం మధ్యలో తిరిగి వస్తాను భయపడకండి, అని.

ఇప్పుడు ఈ వుత్సవాలు ఎలా జరుపుతున్నారు అన్నది చెప్తాను.

ఈనాడు కూడా అవి అన్నీ యధావిధిగా జరుపుతున్నారు ఉత్కళదేశంలో అరటిచెట్టు దొప్పలో లేక చిన్నచిన్న కొయ్యతెపు పడవలో ఆనాటికొరకు ప్రత్యేకంగా తయారుచేసి, వాటిలో ఆకు, వక్క పెట్టి కార్తికపౌర్ణమి నాడు ప్రొద్దుట "ఆ, కా, మా, వై, ఆకు, వక్క నీవి; ధర్మం అంతా నాది" అని ఆ పడవల్ని నీళ్లలోకి వది



# ఆంధ్రలో ★ ★ ★ మహిళాభ్యుదయం

ప్రభుత్వ శాఖలుగాని, ప్రభుత్వం నెలకొల్పిన సంక్షేమ సంఘంగాని ఈ సంఘ సేవా కార్యక్రమాలను నిర్వహిస్తున్నాయి. ఈ కార్యక్రమాలు ప్రారంభింపక పూర్వం నుండి స్వయంగా పూనుకుని సంఘసేవ చేస్తూన్న స్వచ్ఛంద సంస్థలుచాలావున్నాయి. ప్రతిఫలాపేక్ష లేకుండా వివిధ రంగాలలో సంఘసేవ చేస్తున్న ఈ సంస్థలకు ధనసహాయం చేయడం కేంద్ర సంక్షేమ సంఘం ప్రధాన లక్ష్యాలలో ఒకటి. స్త్రీల, పిల్లల శ్రేయస్సుకై కార్యక్రమాలు నడిపే వారికి, వికలాంగులకు, అనాథలకు తోడ్పడి దానికై శరణాలయాలు నెలకొల్పి నడుపుతున్న వారికి కేంద్రసంస్థ ధనసహాయం చేస్తుంది.

## ఐదున్నర లక్షలు

ఆంధ్రరాష్ట్ర సలహాసంస్థ ఏర్పడిన తరువాత 216 స్వచ్ఛంద సేవాసంస్థలకు మొత్తం 5,34,416 రూపాయలను ఈసంస్థ మంజూరు చేసింది విశాఖ జిల్లాలోని ప్రేమ సమాజం, పశ్చిమ గోదావరిజిల్లాలోని స్త్రీ పునర్వివాహ సహాయ సంఘం, తూర్పు గోదావరి జిల్లాలోని జీవకారుణ్యసంఘం కృష్ణా గుంటూరు జిల్లాలలోని వివిధ మహిళా సంస్థలూ, హైదరాబాద్ సికందరాబాద్ నగరాలలో మొత్తం 33 సంస్థలూ—ఈవిధంగా సహాయం పొందేవాటిలో కొన్నిమాత్రమే. పెద్ద నగరాలలో ఉద్యోగాలు చేస్తూన్న స్త్రీలకు నివాస సౌకర్యాలు కల్పించే నిమిత్తం ఏర్పాటైన వసతి గృహాలకు (హాస్టల్స్) కూడా కేంద్ర సంక్షేమ సంఘం సహాయం చేస్తుంది. వీటి నిర్వహణకయే ఖర్చులో సగం భరిస్తుంది.

## శిక్షణ

వివిధములైన ఈ కార్యకలాపాలు సక్రమముగా నడిపించడానికి ప్రత్యేక శిక్షణ పొందిన వ్యక్తులు అవసరం గ్రామ కేంద్రాలను నిర్వహించడానికి గ్రామసేవిక, మంత్రసాని దాయి కావాలి. వీరందరూ ఆయా పనుల్లో బాగా తర్ఫీదు పొందవలసి ఉంటుంది. ఇందుకోసం కేంద్రసంస్థ పాఠ్య ప్రణాళిక ఒకటి తయారుచేసి ఆ ప్రకారం ఇప్పుడు ఆయా పనులలో శిక్షణ ఇస్తున్నారు. సీతానగరం హైదర్ షాకోట కేంద్రంలలో సాలుకు వందమంది గ్రామసేవికలు శిక్షణ పొందుతున్నారు. ఇదేవిధంగా మంత్రసానులు, ద్వితీయశ్రేణి నర్సులూ ప్రత్యేకంగా శిక్షణపొందుతున్నారు. వీరంతా గ్రామ సంక్షేమకేంద్రాలలో పనిచేస్తారు. కాని, సుశిక్షితులైన స్త్రీలు ఇంకా ఎంతోమంది ఈ కార్యక్రమాలకు అవసరం. దేశాభివృద్ధికి, సంఘ సంక్షేమానికీ ఇంకా ఎంతో కృషి జరుగవలసి ఉంది. పల్లెలలోని కోటానుకోట్ల ప్రజలకు ఈ సేవా కార్యక్రమాలను అందించడం, దేశంలో ఏ మారుమూల ప్రాంతాలలోనైనా సరే, సాగే సేవా కార్యకలాపాలకు తగు సహాయంచేసి, అవి బాగా సాగడానికి దోహదం చేయడం— ఇది సంక్షేమ సంస్థ ప్రధాన లక్ష్యాలు. ఈ

## కార్తీక పౌర్ణమి

చేస్తారు

కార్తీక పౌర్ణమినాడు పొద్దుటే ఆడా, మగా, పిల్లా, పెద్ద అంతా నదికివెళ్ళి స్నానం చేసి కాయితపు పడవల్ని అక్కడే కొనుక్కొని, నదిలోకి ఆకు, వక్క పెట్టి వదుల్తారు తరువాత అక్కడేవున్న గుడికివెళ్ళి దేముణ్ణి దర్శించుకుని వస్తారు.

ఆ రోజు నదిఒడ్డు దగ్గరనుండి కిల్లా మైదానం వరకు వరసగా ఎన్నోదుకాణాలు పెడ్తారు ఇవే కాకుండా అక్కడక్కడ నాటకాలు, నృత్యాలు, ఆటలు, పాటలు, హరికథలు అన్నీ వుంటాయి. గాజుల షాపులు, బట్టలషాపులు, హోటళ్లు, మిఠాయి దుకాణాలు అన్నీ అక్కడ చక్కగా అందర్నీ ఆకర్షించేటట్టు అమరుస్తారు. దీన్నే 'బాలిజాత్ర' అని అంటారు. ఈ 'బాలిజాత్ర' చూచుటకు ప్రక్కలనున్న పల్లెటూళ్లనుండి కూడా ప్రజలు వస్తారు. పౌర్ణమినాటి వెన్నెలలో అంతా 'బాలిజాత్ర' చూచి ఆనందిస్తారు. ఏదైనా కొనండే ఎవరు పైకిరారు!!

అన్నిటికన్నా చూచుటకు మనోహరంగా వుండేది నదిలో తాపిగా, ప్రశాంతంగా వున్న నీటిలో ప్రయాణంచేసే కాయితపు పడవలే!! ★



ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ సలహాసంస్థ మారుమూల గ్రామాలలోని సంక్షేమకేంద్రాలలో స్త్రీలకు ప్రసూతిసహాయం ఏర్పాటుచేస్తుంది. గుంటూరుజిల్లాలోని ఒక కేంద్రంలో డాక్టరు స్త్రీలను పరీక్ష చేస్తున్నదృశ్యం.

సంస్థ కేవలం ప్రభుత్వశాఖకాదు ఉద్యోగుల ఉద్యోగేతర వ్యక్తుల సమ్మేళనం ఈ సంస్థ తలపెట్టి సాగిస్తూన్న మహాకార్యం జయప్రదంగా సాగాలంటే, దీనికి ప్రజల సహాయసహకారాలు అత్యవసరం ఈ కార్యక్రమాలవలని ప్రయోజనం పొందే ప్రజలే వాటికి సంపూర్ణంగా సహకరించి, దేశ కల్యాణానికి సాగే ఈ యజ్ఞాన్ని నిర్విఘ్నంగా నడిపించే భారం బాధ్యత వహించవలసి ఉంది

## గత సంవత్సరం....

1956 నవంబరునుండి ఈ నవంబరుదాకా కేంద్ర సంక్షేమసంఘం ఆంధ్రలోని 82 సేవాసంస్థలకు మంజూరుచేసిన ధనం



శ్రీమతి గాదిరాజు వెంకాయమ్మ: తాడేపల్లిగూడెం తాలూకా గణపవరం పంచాయతీకి అధ్యక్షురాలుగా ఎన్నికైనారు

1,24,250 తెలంగాణాలోని 31 సేవా సంస్థలకు మంజూరుచేసిన సహాయం రు 2,05,600

ఇపుడు ఆంధ్రప్రదేశ్‌లో పతితస్త్రీలకు ఆశ్రయం ఇచ్చి బాగుచేసి ఉపాధులు చూపేందుకై రెండురాష్ట్ర శరణాలయాలు, ఇరవై జిల్లా శరణాలయాలూ నెలకొల్పబోతున్నారు రాష్ట్రప్రభుత్వం వీటికై రు. 6,46,000 మంజూరుచేసింది

ఇపుడు రాష్ట్రం మొత్తం మీద 29 సంక్షేమ ప్రణాళికలు అమలు జరుగుతున్నాయి వీటికి మొత్తం ఏడులక్షల రూపాయలు ఖర్చు కాగలదని అంచనా ఇందులో సగం ఖర్చు కేంద్రం భరిస్తుంది నూరింట 25 వంతులు రాష్ట్రప్రభుత్వం ఇస్తుంది మిగతాది ప్రజలు భరించుకోవాలి

★



సాంఘిక సంక్షేమ సలహాసంస్థ ఆధ్వర్యాన నడుస్తున్న సంక్షేమ కేంద్రాలలో బాలబాలికల విశ్రాంతి కార్యక్రమానికికూడా ప్రాముఖ్యం ఉంది. నెల్లూరుజిల్లాలోని సూళ్ళూరుపేట కేంద్రంలో పిల్లల 'బాల్వాడీ' తరగతి.

# ★ కార్తీక చలిమిళ్లు ★

'అన్నాద్దశగుణంపిష్టం' — అంటే అన్నం కన్న పిండి ఎనిమిదిరెట్లు గుణం కలది (బలవర్ధకము) అని అర్థం. అందుకేమరి ఉపవాసాలు, ఒక్కపొద్దులూ చేసే ఈ కార్తీక మాసములో పిష్టం తినడానికి వీలుగా సెపం కల్పించేరు మనపూర్వులు వ్రతాలూ, నోములూ పేర పూజలూ, ఉపవాసాలూ, ఒక్కపొద్దులుచేసే ఈ కార్తీకమాసములో- అష్టాదశవర్ణాలవారూ, ఆబాలగోపాలం కార్తీక సోమవారాలు చేయడం, ఆకాశ

## భారవి కల్యాణి

దీపం పెట్టే ఆడవాళ్లు నక్తాలుచేయడం, తెల్లవారఝామున కార్తీకస్నానాలు, అశ్వత్థప్రదక్షిణాలు చేసి పగలంతా ఉపవసించి నక్షత్రదర్శనము అయిన తరువాత భుజించడం), నాగులచవితి, పెద్ద ఏకాదశి (కార్తీక శుద్ధ ఏకాదశి), కార్తీక పౌర్ణమి రోజులలో నిరాహారం వంటివి చేస్తూవుంటారు అందువల్ల ఇలా ఉపవాసాలమూలంగా దేహం క్షీణించిపోకుండా ఉండేందుకు నాగులచవితి, కార్తీక పౌర్ణమిరోజులలో చలిమిడి, చిమ్మిలి తినడం యేర్పాటుచేశారు

ఈ కార్తీకపౌర్ణమినాడు సువాసినులు 'కార్తీక చలిమిడి' నోముకూడా నోచుకుంటారు. ఈ నోము యేడేళ్లు నోచుకుంటారు. సొమ్ము సాపాటువా సోమతు ఉన్నవాళ్లు వరసగా యేడేళ్లు నోచుకుని పూర్తి చేసుకుంటారు, లేనివాళ్లు వీలూ, సాలూ చూసుకొని ఎప్పుడు సాధ్యపడితే అప్పుడు నోచుకుని పూర్తిచేసుకుంటారు

ఖండతిథి కాకుండా, పూర్ణతిథి అయిన పౌర్ణమిరోజున పుణ్యస్త్రీలు ఈ నోము నోచుకోడానికి తోరిఏడు పట్టె చేసుకుంటారు ఆరోజు ఈనోము పట్టిందికి సంకల్పం చెప్పుకుని గౌరీపూజ చేసి ఈకథ చెప్పుకుంటారు

అనగా అనగా ఒకవూళ్లో రాజుకూతురూ మంత్రికూతురూ వుండేవారు ఒక రోజు కార్తీకమాసములో ఖండతిథి కాకుండా చూచుకొని నిండు పున్నమనాడు రాజుకూతురూ, మంత్రికూతురూ 'కార్తీక చలిమిడి' నోముపట్టేరు ఇద్దరూ నోచుకున్నారు మంత్రికూతురుకి ధనధాన్యాలు కలిగి ఇంటినిండా పిల్లలూ, ఒంటినిండా నగలతో

(41-వ పేజీ చూడండి)

# పోగులు తీసి కుట్టే విధానము



ముందు 1 వ బొమ్మలో వున్న డిజైన్‌ను మనకు కావలసిన గుడ్డపైన ట్రేస్ చేసుకోవాలి. ఇందులోని మామిడికాయలకు ఎలా పోగులు వేసి కుట్టాలో చెప్తాను. ముందు మామిడికాయల చుట్టూ (జంట గీతలకు) దగ్గిర, దగ్గిరగా గుడ్డ కనిపించకుండా కాజా కుట్టు (Batton hol<sub></sub>stitcb) కుట్టాలి. కాజాకుట్టు ముడులు బైటివైపు వుండాలి.

ఇక ఆకులను ఓపిక వున్నవారు నింప వచ్చు. లేనివారు గొలుసు కుట్టుకాని కాడ కుట్టుకాని వేసి కుట్టకోవచ్చును.

ఈ కుట్లు ముగించిన తర్వాత గుడ్డను తిరగేసి పోగులు తీయాలి. ఎందుకంటే పోగులు కత్తిరించినప్పుడు చిన్న చిన్న కొసలు ముందువైపు కనిపించవు పోగులు అడ్డంగాను నిలువుగాను కూడా తీయాలి. మొదట రెండు పోగులు తీయాలి. తరవాత మూడు పోగులు వదలి తిరిగీ రెండు పోగులు తీయాలి ఇలాగే మూడేసి పోగులు చొప్పున వదలి, రెండు పోగులు తీస్తూ, డిజైను అంతా పూర్తి చేయాలి. పోగులు మూడు వదలి రెండు ఎలా వేయాలో, రెండవ బొమ్మలో చూడండి. విశదంగా వుండాలని అందులో పోగులు విడిగా దూర దూరంగా వేశాను. పోగులు చాలా జాగ్రత్తగా తీయాలి. పోగుల్ని సన్నని సూదితో ఎత్తి, బ్లేడుతో కోయాలి. మనము గుడ్డను త్రిప్పి వెనక వేపు పోగులు కోయడంవల్ల చిన్న చిన్న పీసులు వెనుక భాగముననే నిలుస్తాయి.

3 వ బొమ్మలో పోగులు తీసిన తర్వాత గుడ్డ వుండే విధానాన్ని చూడొచ్చు. నల్లని భాగమంతా పోగులు లేని కాళీస్థల మన్నమాట.

ఇక పోగులు కుట్టే విధానం :- గుడ్డను మామూలు (Right side) వైపుకు వుంచుకోవాలి. సూదికి ఒంటిపోగు దారం (ఎం. కె. గాని యాంకర్ గాని) ఎక్కించాలి సూదిని క్రింది నుండి పైకి తీయాలి. నిలువు పోగులు, అడ్డ పోగులు కలిసేచోట పై



నుండి దారాన్ని పోనిచ్చి, సూదిని క్రింది నుండి ఎడమవైపుకు తీయాలి. తిరిగి రెండు వైపుల నుంచి పోగులు కలిసేచోటు మీదుగా దారాన్ని పోనిచ్చి క్రింది నుండి సూదిని ఎడంవైపుకు తీసుకోవాలి. 5 వ బొమ్మలో చూస్తే ఎలా కుట్టాలో తెలుస్తుంది. లైను



అంతా యిలాగే పూర్తి చేయాలి. పైనుండి తిరిగి క్రిందికి కుట్టే విధానం :- మనం రెండు వైపుల పోగులు కలిపే చోట దారాన్ని పోనిచ్చాం మొదటిమారు. ఈమారు ఆదారం పైన ఇంటు ఆకారంగా దారాన్ని పోనిచ్చి కుట్టాలి. ఇలాగే అన్ని పోగులూ కుట్టాలి. 4-వబొమ్మలోచూస్తే క్రిందికి కుట్టే విధానం తెలుస్తుంది. ఇష్టమున్నవారు పోగులకు ఒక కుట్టు కుట్టినా ఫరవాలేదు.

5 వ బొమ్మలో నల్లగా కనిపించే గుర్తులు బైటివైపుకు కనిపించే దారము. సన్నగా కనిపించేది లోపలివైపు దారము.

ఈ పోగుల్ని కుట్టేటప్పుడు లాగి, లాగి బిగుతుగా కుట్టాలి. అప్పుడు 5 వ బొమ్మలోని లోవైపు దారము అసలు మనకు కుట్టులో కనిపించదు.

పోగులు మందపాటి గుడ్డలో వేయడానికి సులభంగా వస్తాయి. సిల్కులో వేయడం చాలా కష్టం. కాని తీస్తే చూడ్డానికి చాలా



బాగుంటుంది. చిన్నపిల్లల ఫ్రాకు చుట్టూ 3, 4 డిజైన్లు వేసి పోగులు వేసి కుట్టే చాలా బాగుంటుంది. పసుపుపచ్చ సిల్కు పైన డిజైన్‌కు ఆకుపచ్చరంగు వాడి లోపల పోగులకు ఎరుపు వాడితే చాలా బాగుంటుంది. దారాల రంగులు వారి వారి యిష్టాన్ని బట్టి ఎన్నుకోవచ్చు. టేబుల్ క్లాత్‌కు కూడా ఇలా పోగులు తీసి కుట్టవచ్చు. ★


**మంగళా కందూర్**
విశాఖపట్టణం




## పచ్చికూరల ప్రాముఖ్యం:

# పంజాబీల ఆహారం

పంజాబీలు ఆరోగ్యం, బలము కలిగి చాలా అందంగా ఉంటారు. అందుకు కారణం వాళ్ళ భోజనమే అనాలి. వాళ్ళకీ మనకీ చాలా భేదం ఉంది. వాతావరణానికి తగినట్లుగా భోజన పానీయాలుండాలి. అలాగ లేకపోతే ఆరోగ్యం దెబ్బతింటుంది. మన ప్రక్క రెండుపూట్లా అన్నం తింటే వంటికి పడుతుంది. కాని ఇటుప్రక్క (ఉత్తర దేశంలో) అన్నంకంటే గోధుమ రొట్టెలు తింటేనే ఆరోగ్యంగా బావుంటారు. ఇటు ప్రక్కవారి ఆహారం చాలా బలమయినది. మన ఆహారానికీ, ఇటుప్రక్కవారి ఆహారానికీ ఎంత భేదంవుందో రాస్తాను. మనం అన్నం తింటాము. వాళ్లు రొట్టెలుతింటారు. ఈ రెండిట్లోకీ గోధుమ రొట్టెలు చాలా బలమయినవి. అన్నం అంత బలమయినది కాదు. అందులోనూ మనలో చాలమంది అన్నంవారుస్తారు. అలావార్చకూడదు. వారిస్తే అన్నంలో సారమంతాపోయి పిప్పి మిగులుతుంది. పప్పుబలమైనది అందులోపొట్టుఉన్న పప్పులు చాలా బలమయినవి. ఇక్కడివారు పొట్టుపప్పులనే ఎక్కువగాతింటారు. ఇంక, కాయకూరలు. అవి మనం ఉడికించి వార్చి, అందులో అన్నీ వేసివండుకుంటాము. కూరలువార్చినా, సారంపోతుంది. ఇక్కడివారు వార్చి వండినకూరలు చాలాతక్కువ తింటారు. ఇవికాక పచ్చికూరలు విరివిగా తింటారు. పచ్చికూరల్లో ఎక్కువ విటమిన్లుంటాయన్నది చాలామందికి తెలిసినవిషయమే. ఇప్పటికి వాళ్ళ ఆహారానికీ మన ఆహారానికి పోలికచూస్తే మనం తిన్నది ఏమీలేదని పిస్తుంది అందునుండి మనంకూడ పచ్చికూరలు తినటం అలవాటుచేసుకుంటే వంటికి చాలా మంచిది. ఏవి ఎలాతినాలో ఈ క్రింద రాస్తాను.

### కూరలు

కొన్నికూరలు పచ్చివి తినిందికి రుచిగా ఉంటాయి అవేమిటంటే ముల్లంగి దుంపలూ, కేరట్, బీట్ రూట్, టొమాటో, లెట్యూస్ ఆకులూ, దోసకాయలూ (చిన్నవి) ఇవి సాధారణంగా అన్ని ప్రాంతాలలోనూ దొరికేవి. ఇవికాక ఇటుప్రక్క రేడిష్ (ముల్లంగి) అని చిన్నదుంపలు దొండకాయ సైజున కుంకుమ రంగుతో ఉంటాయి. చెరువుల్లో 'సింగాడా' అని ఒక రకమయిన కాయలు తియ్యగా ఉంటాయి. పైనచెప్పిన కూరలన్నీ ఇటుప్రక్క ప్రతిరోజూతింటారు. ఇవి తాజాగా వున్నవి తెచ్చి బాగా కడిగి సన్నగా పైచెక్కుతీసి తినవచ్చును. ముల్లంగి దుంపలు కొంచెం కారంగా ఉంటాయి కాబట్టి ఉప్పుఅద్దుకు తినవచ్చును. టొమాటో దోసకాయలు, బీట్ రూట్, కేరట్, ఇవి పుల్లగాకొన్ని తియ్యగాకొన్ని ఉంటాయి కాబట్టి పచ్చివే తినొచ్చును. ఇవి రోజూ తింటేబలం, అందరూ కొనుక్కొగలుస్తారు.

ఎస్. సుగుణ
(హిస్సార్, తూర్పుపంజాబ్).

అన్ని రకాలు ఒక్కరోజే కాకపోయినా రోజుకి ఒకటి రెండురకాలు తింటే మంచిది. ఈరోజుల్లో చాలా చవగ్గా అమ్ముతారు. ఈకూరలు గాజుప్లేట్లలో అందంగా అమర్చి పెట్టితే చూసిందికి అందంగాఉండి తినాలని బుద్ధిపుటుతుంది నోరూరుతుంది.

ఇటుప్రక్క ఎవరింటికేనా భోజనానికి వెళ్తే వాళ్ళ డైనింగ్ టేబిల్ చూస్తేనే సగం కడుపు నిండిపోతుంది. అంటే అంత అందంగా అలంకరిస్తారు. ఆ టేబిల్ మీద వున్న వస్తువుల్ని టెక్నికలర్ ఫోటోతీస్తే చూట్టానికి ఎంతో బాగుంటుంది. కొన్ని పత్రికల్లో వేస్తూవుంటారుకూడా. చూసిందికి ఎన్నోరకాలపదార్థాలు కనిపిస్తాయి వివిధరంగుల్లో. కాని వాటిలో చాలా పదార్థాలు వండకుండానే చుట్టూ అమరుస్తారు.

ఈమధ్య ఒకళ్ళింటికి భోజనానికివెళ్ళేము. ఆవిడ రెండుకూరలూ, పప్పు, రొట్టెలు, అన్నం, హల్వాచేసి ఇవేమో కంచంలోపల, కటోరీల్లో (చిన్నగిన్నెలు) ఉన్నాయి. ఇవికాక, కంచంచుట్టూ ఓ డజను చిన్న గాజుప్లేట్లలో ఈ పచ్చికూరలూ, ఆవకాయ మొ॥ ఉన్నాయి. ఒకగాజు ప్లేటులో ముల్లంగి, ఇంకోదాంట్లోకేరట్లూ ఇలా ఒక్కొక్కప్లేటులో ఒక్కొక్కరకం కోసి పెట్టింది. ఇవికాక పెద్ద గాజుప్లేటులో అన్ని రకాలకూరలూ కలిపి అందమయిన డిజైను మాదిరి అలంకరించింది. ఎలాఅంటే గాజు ప్లేటులో లేతలెట్యూస్ఆకులు అన్నీ ఒకేసైజువి పేర్చింది. (లెట్యూస్ ఆకులతో శాండ్విచెస్ చేసుకునికూడా తినవచ్చును) లేతఆకులమధ్య ఎర్రగా చక్రంమాదిరికోసిన టొమాటో మధ్యగింజల్తో తమాషాగా ఉన్నాయి. టొమాటోచుట్టూ బిళ్లలమాదిరి కోసిన ముల్లంగి, కేరట్, బీట్ రూట్ కోసి అన్ని అందంగా, రంగులు కొట్టొచ్చినట్టు పేర్చింది మధ్యమధ్య ఉల్లిపాయ చీలికలూ, అల్లం, పచ్చిమిరపముక్కలు చల్లింది. ఇలా అన్నిరంగుల్లోనూ లేతకూరలు కనిపిస్తే ఎప్పుడూ పచ్చికూరలుతినని మా అమ్మగారు కూడ ఆరోజుతిన్నారు. ఆమెచేసిన అలంకర



వామనగుంటలు
ఫోటో: పసల కృష్ణకుమార్]




## తెలుసుకోవలసినవి

కామేశ్వరిగారి, "మిగతా ముక్కానీ ఏం చేశావు" అన్న వ్యాసం చదివాను చాలా బాగుంది వున్నది వున్నటుగా రాసిన వారికి నా అభివందనలు. నే నొకరింటి దగ్గిరచూశా. తండ్రి జేబులోంచి డబ్బులు సంగ్రహిస్తున్న కొడుకుని మందలిస్తోంది ఒక తల్లి, "నువ్వు మొన్న నాన్నగారికి చెప్పకుండా రూపాయి తియ్యలేదేమిటి నేతీస్తేతప్పేమిట"ని కొడుకు సమాధానము తల్లి దొంగతనముచేస్తూ కుర్రాడిని వద్దంటే మానుతాడా? మరి తండ్రికి తెలియక, తల్లి భయంలేక పెరిగిన కుర్రాడు చిన్న దొంగ పెద్ద దొంగగా మారటములో ఆశ్చర్యమేమీ లేదుకదా? తను ఓయింటి యజమానురాలైకూడా విసమెత్తుస్వాతంత్ర్యం లేక ఆ భార్యా, తల్లి అడుగుజాడల్లోనే నడచి చెడుదారినపడే కొడుకు, అలా కావడానికి మరి ఆ యింటి యజమానే బాధ్యుడు కాక తప్పదు. అవసరానికి తగినంత డబ్బు వున్న స్త్రీలు యింటి దొంగలు కానేకారు. తమ్ముడి పెళ్లికొచ్చిన నా స్నేహితురాలు, తమ్ముడికి కట్నము చదివించేందుకు నా దగ్గిర 5 రూ. బదులు తీసుకెళ్లింది 5, 6 సంవత్సరాలనించి కాపురము చేస్తున్నదాని భర్త, కాకమరిది పెళ్లికి రాకపోగా కట్నము చదివించేందుకైనా దానిచేతికి డబ్బివ్వలేదు. ఆడబడుచులాంఛనాలైతే ఏవిమరో రూపంలోనైతేనేమి 50, 60 రూ. తీసుకెళ్లి అది, తమ్ముడికేమాత్రము ముట్టచెప్పకపోతే బాగుంటుందా? పెళ్ళికొచ్చిన వారు వూరుకుంటారా? మరి యిల్లాటి పరిస్థితుల్లో స్త్రీ ఇంటిదొంగ కాకేమవుతుంది. కాగా పోగా భార్యచేతికి డబ్బిస్తే పుట్టింటికి చేరేస్తుందని కొందరి భయం అల్లాటి వాళ్లూ లేకపోలేదు. అల్లాగే అనుకున్నా ఆమెస్వంత ఖర్చులకోస మిచ్చిన 1 రూ, 2 రూపాయిల్లోను పుట్టింటి కేపాటి చేరేస్తుంది. చేరేసినా అందులో ఏపాటి నష్టమొస్తుంది. కాకపోయినా అణాకి బేడకి భర్త (లేక కొడుకు) దగ్గిర చెయ్యి చాచటమంటె అభిమానముగల ఏస్త్రీకైనా కష్టమే. అదీగాక తమతోపాటె అణాకి బేడకి తండ్రిని డబ్బడిగే తల్లిని చూసిన ఏ పిల్లలకి తల్లంటే ఏపాటి ఖాతరు ఉంటుంది?

బి. ఎస్. లక్ష్మి (కాకినాడ).

* * *

28-10-57 నాటి పత్రికలో శ్రీమతి కామేశ్వరిగారి "మిగతా ముక్కానీ ఏం చేశావ్?" వ్యాసం చదివి చాలా ఆశ్చర్యపడ్డాను. ఈ రోజుల్లో భార్యలు తమ భర్తల్ని నూటికి నూరుపాళ్లు తమ చేతుల్లో పెట్టుకో నుంటే వాళ్ళ ఉదాహరణలెన్నైనా చూపొచ్చు. వచ్చే జీతపు రాళ్ళు అణాపైసలతోటి తమకివ్వకపోతే తక్కువిచ్చినందుకు తూన్నారన్ని మూతి బిగింపులు, లేదా, దానికి ఆరాలు వగైరా చెప్పాలి (తృప్తిపడరులెండి) నమ్మి సమ్మతించిన వాళ్ళూ వున్నారు, కస్సు బుస్సుమన్న వాళ్ళూ వున్నారు. కానీ కేవలం భర్త ఆదరాభిమానాలపై నాధారపడిన భార్యా'మణులు'మాత్రం గాజుపూసలైకంచుకొగడాకు కూడా నానరారంటే నిజమైన నిజం వేరేవుందా?

పైగా, నెలకి వెయ్యిరూపాయలు తెచ్చే కుటుంబపు యిల్లాలికి తనే పూలు యిచ్చిందంటే కేవలం తన యీవిని చాటుకున్నట్టుగానే తోస్తుంది. నెలకి వెయ్యిరూపాయిలు తెచ్చేభర్త పట్నంలో కాపురంచేస్తూ అంత పెద్ద వుద్యోగభారాన్ని మోస్తూ — యింటి వెచ్చాలుకూడా తనే చూడాల్సిన ఖర్మేం కాలింది?

భర్తల కష్టార్జితాన్ని చాటుగా పుట్టింటికో — పెళ్ళయిన కూతుళ్ళకో పంపి — అదీ లేకపోతే తనకిష్టమైన చీరలుకొని పుట్టింటి వారిచ్చారని బొంకి, పుట్టింటి గౌరవం నిలబెట్టు భార్యల్ని ఏమనాలో? ఇదంతా అబద్ధమా? కేవలం భర్తల తప్పే నంటారా?

ఎల్. వెంకట్రమణ (చిన్న తిప్ప సముద్రం)

* * *

## నచ్చలేదు

'మిగతా ముక్కాణీ ఏంచేశావ్?' అను వ్యాసమును చదివాను చాల బావుంది కాని అందులో కొన్ని విషయాలు నాకు నచ్చలేదు.

"ఆర్థిక స్వాతంత్ర్యం లేని భార్యలు యింట్లో పప్పూ, ఉప్పూఅమ్మి వాళ్ల అవసరాలు తీర్చుకోవటం అరుదు కాదు" అని వ్రాశారు. ఇట్లా చేసేవారు ఉన్నారు కాని కేవలం ఆర్థికస్వాతంత్ర్యంలేక చేసేవారు నూటికి ఒక్కరు ఉంటారేమో! కామేశ్వరిగారు ఈ విషయంలో పొరపడ్డారనవచ్చు ఆమె పల్లెటూరి వాతావరణం ఎరగ నట్లున్నారు. ఎందుకంటే కేవలం ఆర్థిక స్వాతంత్ర్యం లేకకాదు అలా అమ్మేది. పల్లెటూళ్లలో చాలామంది స్త్రీలు (పెద్ద మోతుబరి రైతుల భార్యలు కూడా), వారితో సమానంగా ఆర్థిక స్వాతంత్ర్యంఉన్నప్పటికీ, తాము పాడి మొదలగువాటిమీద డబ్బు తీస్తున్నప్పటికీ, పురుల్లోనిభాన్యం (షుమారు బస్తావరకు), ఇంట్లోని ఉప్పూ, పప్పూ దొంగతనంగా అమ్ముతూనే ఉంటారు ఇందుకు కారణం ఆర్థిక స్వాతంత్ర్యం లేకా? కాదు మరి ఎందుకు? కోడళ్ళు, కొడుకుల దగ్గరఉంటూ, ఆయింట్లో వేదోచి, చాటుగా కూతుళ్లకు పంపేవారు మా బంధువుల్లోనే చాలామంది ఉన్నారు దీనికి కారణం వారినైజం. అంతేకాని ఆర్థికస్వాతంత్ర్యం లేక కాదు. మరి ఆ ఆర్థికస్వాతంత్ర్యము ఉన్నప్పటికీ మనమిలా చేస్తూ, లేనిదానికి కావాలంటే అది అన్యాయమే నేమో! ముందు మనకు ఉన్నదాన్ని సద్వినియోగంచేసికొని, ఆపైన ఏదికావాలన్నా

## పచ్చికూరల ప్రాముఖ్యం

...కి, ఆ మొఓపికకీ నే నెంతో ఆశ్చర్యపోయేను. ఇంతకీ నే చెప్పబోయేదేమంటే కంటికి అందంగా కనిపించినపదార్థాలు తయింధకపోయినా తినాలనిపిస్తుంది ఈ పచ్చికూరలు మొదట్లో అందరికీ నచ్చకపోవచ్చును. అటువంటివారు ఉప్పు, మిరియపుగుండ అద్దుకునితింటే రుచిగా ఉంటాయి. స్నేహితుల్ని భోజనానికిపిల్చినప్పుడు ఇలా కొత్తగా అమర్చిపెడ్తే గొప్పగా ఉంటుంది. ★

సుఖంగా ఉంటుంది.

వై. అనార్కలీ (కైకలూరు)

*　　*　　*

## ప్రత్యామ్నాయం

కామేశ్వరిగారి వ్యాసం బాగుంది. "మనిద్దర్లో ఎవరు ఖర్చుచేసినా మనకోసమే కదా" అని భార్యాభర్తలిద్దరూ కూడబలుక్కుని ఖర్చు చేస్తూంటే ఈ ఇబ్బందులుండవు. "నా సంపాదనంతా దానికే చాలదు" అని ఆయనా, "నాకేమీ యివ్వరు, ప్రతిదానికీ చెయ్యి చాచాల్సిందే"నని ఆమె అనుకుంటుంటే, ఆ సంసారంలో అనందమేముంటుంది. ఇద్దరికీ సమాన స్వాతంత్ర్యమైనా వుండాలి. ఒకరు సర్దుకుపోయే వారైనా అవాలి. అప్పుడా కుటుంబం కళకళ్ళాడుతుంటుంది.

వి. ఎస్. లక్ష్మీరావు (తెనాలి)

*　　*　　*

## సామాన్యంగా

కామేశ్వరిగారు 23-10-57 పత్రికలో రచించిన వ్యాసం "మిగతా ముక్కాణీ ఏం చేశావ్" చదివేను చాలా బాగుంది. ఆమెకు నాయొక్క కృతజ్ఞతాభివందనాలు. సామాన్యంగా ఉద్యోగము చేసుకొనే స్త్రీలకు అయితే పరవాలేదు కానీ మిగతా స్త్రీలందరికీ ఇదే సమస్య!

న్యాయపతి అమ్మాజీ,
(శ్రీకాకుళం)

*　　*　　*

## విజ్ఞానంకోసం

శ్రీ బి. నారాయణరావుగారు 2-10-57 పత్రికలో గ్రంథాలయాలను గురించి రాసింది చదివాను బాగారాశారు- 'సాధారణంగా ముఖ్యంగా స్త్రీలు నవలలే చదువుతారు' అని రాశారు. వారు రాసింది చాలవరకు నిజం. ఆ నవలల్లోకూడా 'డిటెక్టివ్‌లు' అంటె ప్రాణం! ఉత్తమగ్రంథాలు చదవబుద్ధికాదు! ఈ భాగ్యానికి స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయాలు కావాలంటారు. మా ఇంటి సమీపంలో 'డిస్ట్రిక్టు సెంట్రల్ లైబ్రరీ' వుంది. దాంట్లో, స్త్రీలకై ఒక విభాగం కూడా ఏర్పాటుచేశారు. కాని చుట్టుపట్ల నివసించే మధ్యతరగతి స్త్రీలెవ్వరూ (బాగా చదువుకున్నవారై) తమకు వీలయినపుడు అక్కడికివెళ్ళి చదువుకోరు. పోనీ, అక్కడ కూర్చొని చదవటానికి ఇష్టంలేనివారు తమకు కావలసిన పుస్తకములు తామే ఏరుకొని ఇంటికి తెచ్చుకొని చదవవచ్చుగదా!

లైబ్రేరియన్సుకు అశ్రద్ధ, నిర్లక్ష్యం ఎక్కువ అని వాళ్ళమీద లేనిపోని అభాండాలు వేయుటవల్ల ప్రయోజనం వుండదు. ఒకవేళ అటువంటి వారెవరైనావుంటె వాళ్ళను సరియైన దోవకు తీసుకురావటానికి స్త్రీలే పూనుకుంటె మంచి ఫలితాలు త్వరగా కలుగుతయ్!

చాలామంది స్త్రీలు సినిమాలు, నాటకాలు మొదలైనవాటికి తమ మగవారు వెంట రాకపోయినా భయం, భిడియం లేకుండా చక్కగా వెళ్తారు. ప్రత్యేక సినిమాలు' నాటకశాలలు అక్కర్లేదు. అట్లాగే, స్త్రీలు పురుషుల గ్రంథ, పఠనాలయాలకు వెళ్ళి స్వేచ్ఛగా, నిర్భయంగా చదువుకోవచ్చు. అభ్యంతరం వుండక్కర్లేదు.

సినిమాకు వినోదంకోసం వెళ్ళితే గ్రంథాలయానికి విజ్ఞానంకోసం వెళ్లాలి.

మందపాటి శేషమోహనరావు,
(గుంటూరు)



## ★ కార్తీక చలిమిళ్లు ★

(37-వ పేజీ తరువాయి)

సుఖంగా వుంది. రాజుకూతురు, రోగారుడైన భర్తతో, నానాటికీ క్షీణిస్తున్న సంపదతో హీనస్థితిలో గోడాలుగావుంది. ఇదిచూసి రాజుకూతురు సహించలేక, పార్వతీపరమేశ్వరులను తలపోస్తూ, తన హీనస్థితికి చింతిస్తూ అరణ్యమధ్యానికి వెళ్లి అక్కడ ఏడుస్తూ కూర్చుంది.

"ఆసమయంలో భూమి పాలించడానికి వచ్చిన పార్వతీపరమేశ్వర్లు రాజుకూతురు ఏడుపువిని, వృద్ధబ్రాహ్మణ దంపతుల రూపంలో అక్కడికి వచ్చి 'ఎందుకు ఏడుస్తున్నావు' అని రాజుకూతుర్ని అడిగేరు. అందుకా రాజుకూతురు 'ఎందుకో అందుకు ఏడుస్తున్నాను, మధ్య మీకెందుకు? మీరేమేనా ఆర్చేవారా? తీర్చేవారా?' అని బదులు చెప్పింది. ఆ మాటలకి తప్పకుండా 'ఆరుస్తాం, తీరుస్తాం, ఎందుకేడుస్తున్నావో చెప్తేగాని వీల్లే'దని పార్వతీపరమేశ్వర్లు పట్టుబట్టారు. అప్పుడు రాజు కూతురు వాళ్ళతో జరిగిన సంగతంతా చెప్పింది. అది విన్న పరమేశ్వరుడు 'రాజుకూతురూ, మంత్రికూతురూ, ఒక్కసారే నోముపట్టి నోచుకున్నారు కదా! మంత్రి కూతురు అలాగ, రాజుకూతురు ఇలాగ వుండడానికి కారణమేమి'టని పార్వతీదేవిని అడిగేడు.

పరమేశ్వరుడు అడిగినదానికి పార్వతీదేవి ఇలా సమాధానం చెప్పింది:

రాజుకూతురూ, మంత్రికూతురూ ఒక్కసారే నోముపట్టినప్పటికీ రాజుకూతురు ఉల్లంఘనము చేసింది. మంత్రికూతురు మాత్రం అలా కాకుండా తొలియేడు నీరుచేరి కొల్చింది కనుక నిధీ, నిక్షేపం ఇచ్చేను; రెండోయేడు మానుచేరి కొమ్మకింద కొల్చింది కనుక మాణిక్యాల్లాంటి బిడ్డలూ, కొమ్మలేనుగులాంటి కొడుకునీ ఇచ్చేను; మూడోయేడు నన్నుబోలి వుండడానికి నిన్ను చేరి కొల్చింది కనుక నిత్యమాంగల్యం ఇచ్చేను; రాజుకూతురు ఇవేమీ చెయ్యక ఉల్లంఘనము చేసినందుకు ఇలా అయింది!

ఈ ప్రకారంగా పరమేశ్వరుడితో చెప్పినతరువాత వృద్ధబ్రాహ్మణిరూపంతో వున్న పార్వతీదేవి, రాజుకూతురుతో కూడా సంగతంతా చెప్పినమీదట 'మళ్ళీ నోముపట్టి ఉద్యాపన చేసినట్లయితే అంతా సవ్యంగా వుంటుం'దని చెప్పింది. అంతే కాకుండా వెంటనే రాజుకూతురుచేత నోము పట్టించి ఉద్యాపన చేయించింది పార్వతీదేవి. ఆ తరువాత నగరుకి చేరుకున్న రాజుకూతురు, ధనధాన్యసమృద్ధితో తులతూగుతూ పరిపూర్ణ ఆరోగ్యవంతుడైన భర్తని చూసి ఆశ్చర్యపోయింది. కొంతకాలానికి రాజుకూతురు చుక్కల్లాంటి చక్కని బిడ్డల్ని కని సుఖంగా వుంది."

'రాజుకూతురు నోచిన నోము అందరూ నోచేరు, అందరూ నోచిన నోము మనమూ నోచేము' అంటూ ఈ కథ చెప్పుకుని చెక్కట గంథము, నెత్తిన అక్షతలూ సిగలో పువ్వూ పెట్టుకుంటారు. ఆపైని తాము బొట్టుపెట్టుకుని ముత్తయిదువలకి బొట్టుపెట్టి దక్షిణతాంబూలాలతో వాయన మిస్తారు

దీనికి ఉద్యాపన: తొలియేడు మానికల బియ్యం, మలియేడు 10 మానికల బియ్యం, మూడోయేడు 15 మానికల బియ్యం నానబోసి, పిండికొట్టి చలిమిడిముద్దలు చేసి తొలియేడు అయిదుగురు ముత్తయిదువులకి నీటిఒడ్డున, రెండోయేడు పదిమందికి కొబ్బరిచెట్టుకింద, మూడోయేడు శివాలయంలో నందిశంకరుల మధ్యగా 15 మందికి దక్షిణ తాంబూలాలతో ఆ చలిమిడిముద్దలు వాయనమివ్వాలి.

కడుపు గంటుపడ్డవాళ్లు ఈ నోము నోచుకుంటే మరింకెప్పుడూ కడుపుశోకం వుండదని మనవాళ్ళ నమ్మకం సంపద సౌభాగ్యాల కోసం, సంతానంకోసం సువాసినులు ఈ నోము నోచుకుంటూ వుంటారు.



# బాల సాహితి

## అవ్యక్త ప్రశ్నలు

పగటివేళను సూర్యుడంటివి,
రాత్రిపూటను చంద్రుడంటివి,
సూర్య చంద్రులు తారుమారవ
లోకమేగతి నుండునమ్మా?

మబ్బు నిలువదు ఎందుకంటే
గాలి విసురుకు పోవునందువు.
ఎక్కడమ్మా గాలి కంటికి
కానుపింపదు మబ్బులాగా?

సూర్యదేవుడు లేకపోతే
జీవరాశులు బ్రతుకవందువు.
రాత్రివేళను ఎట్లుమనమూ
బ్రతుకుచుంటిమొ చెప్పవే?

పొద్దు పొడిచెను లేవమంటూ
పెద్దగా మేల్కొల్పుతావే?
ఎవరు చూచిరి చెప్పవమ్మా
సూర్యుడే ముందొచ్చెనేమో?

ఎండలో నే నాడుకుంటే
నల్లబడతానంటివే?
ఎండనిచ్చేసూర్యు డెందుకు
తెల్లబడనో చెప్పవమ్మా!

వానకురిసే దెందుకంటే
కూటిగింజలకంటివే?
గింజపండుట పొలములోగద
ఊరి మీదీ వాన దేనికి?

సూర్యుడుంటే చంద్రుడుండడు,
చంద్రుడుంటే సూర్యుడుండడు.
ఎక్కడెవ్వరు ఎప్పుడెందుకు
దాగియుందురొ చెప్పవమ్మా?

అప్పుడప్పుడు ఇద్దరున్నా
కానుపించెద రెందుకమ్మా?
కుముదబాంధవు డేలనమ్మా
పాలిపోయీ కానిపించును?

అంతరిక్షము నెన్నడైనా
దాటిచుక్కలు వచ్చెనమ్మా?
ఏమి మాయయొ చెప్పవేమే
ఎన్నిసారులు అడిగినా?

నాన్నగారిని అడిగితే "మీ
అమ్మనడు" గని కోపగించిరి.
ఇంక ఎవ్వరు చెప్పగలరే
నీవు చెప్పక తప్పదమ్మా.

★ రాయ్ చౌదరి ★

# పులిని చూచిన నక్క

అనగనగా ఒకమహారాజు వుండే వాడు. అతని పేరు విజయదత్తుడు. ప్రజలను కన్న బిడ్డలవలె కంటికి రెప్పమాదిరిగా కాపాడుతూ రాజ్యం చేస్తూ వుండేవాడు.

ఒకనాటి మధ్యాహ్నం, మహారాజు షడ్రసోపేత భోజనం ముగించి వరండాలో పచార్లుచేస్తున్నాడు. దాసీకవచ్చి ప్రక్కన నిలిచింది. ఆవిడ హస్తంలోని పళ్లెరంలోవున్న తాంబూలం రాజుగారు సేవించ నారంభించారు. ఇంకొక ప్రక్క రాజపరివారం నిమీలిత నేత్రాలతో, బద్ధహస్తాలతో నిలిచివున్నది. ఆ సమయంలో మహామంత్రి రాజ భవనంలోకి ప్రవేశించటానికి వస్తున్నారు. రాజుగారు వుమిసిన తాంబూలం మహామంత్రి మూర్ధాన్ని ముద్దెట్టుకొన్నది. మహామంత్రి కోపం మిన్ను ముట్టింది. భావోద్వేగంతో ఒక్క పరుగున మహామంత్రి రాజుగారి సన్నిధికి వచ్చాడు. ఉమిసినవారెవరయినదీ మంత్రికి తెలియదు. "ఈపని చేసినది ఎవరు?" అని మంత్రి సింహంలా గర్జించాడు పరివారం వైపు తీక్షణంగా చూస్తూ. మహారాజుకు మహా చెడ్డ చిక్కు వచ్చి పడింది. తానే ఆపని చేశానని యెలా అంగీకరించ గలడు ?

ఆ పరివారంలో శివరాం అనే అతడు అసలు విషయాన్ని మొదటి నుండిచూస్తున్నాడు. అతడు వెంటనే పరివారంలో నుండి ముందుకువచ్చి "మహామంత్రీ! క్షమించండి.చూడక పొరపాటున ఉమిశాను" అన్నాడు. చేతులు కట్టుకొని. మంత్రిమాత్రం మరీ మండిపడసాగాడు. మహారాజు మనసులో మహానందాన్ని పొంద నారంభించాడు. మనసులోనే శివరాంకు కృతజ్ఞత నర్పించుకొన్నాడు తన పరువును కాపాడినందుకు. "మహామంత్రీ! ఇదంతా చూడక పొరపాటునజరిగింది. అతడు క్షమాపణ వేడుకొంటున్నాడు. ఇదుగో! ఈ బంగారపు ఉంగరాన్ని తీసుకోండి మీమీద మాకు వున్న గౌరవానికిచిహ్నంగా. జరిగినదంతా మరిచి పొండి" మంత్రి చల్లబడి

పి. వి. యల్. నరసింహరావు

అంతా మరచి మౌనంవహించాడు.

మహారాజు శివరాం వైపు తిరిగి "బహిరంగంగా ఒక చెడ్డపనిని చేశానని అంగీకరించగల నీ ధైర్యాన్ని యెంతో మెచ్చుకొంటున్నాను. ఇదుగో" అంటూ రాజు అతనికినూరు దీనారటంకాలను బహూకరించాడు. శివరాంకు జరిగిన ఈ సన్మానాన్ని చూచి ఆ పరివారంలో వున్న మదనుడు అనే అతనికి చాలా ఈర్ష్య కలిగింది. తనకూడా అలాటి బహుమానమే యెందుకు పొందగూడదని మనసులో ఒక ఆలోచన పుట్టింది. మరునాడు యథాప్రకారంగా క్రిందటిరోజు మాదిరిగానే అందరూ వరండాలో కూర్చొని తాంబూల సేవనం కావిస్తున్నారు. సరీగా మహామంత్రి భవన ద్వారాన్ని ప్రవేశించే సమయం చూసి సిద్ధంగా వున్న మదనుడు ఒక్కసారిగా నోటిలోవున్న తాంబూలం మొత్తం మంత్రి వంటిమీద పడేరీతిగా వుమిశాడు. మహామంత్రి యీసారి పెను గాలికి వూగేవృక్షంలాగా కోపంతో వణికిపోతూ రాజ సన్నిధికివచ్చి "ఎవరు యీపని చేసింది?" అని గర్జించాడు.

మహారాజునుండి బహుమతి వస్తుందని కలలుగంటున్న మదనుడు వెంటనే లేచి "మహామంత్రీ! క్షమించండి. నేనే పొరబాటున చూడక వుమిశాను" అన్నాడు మహారాజు వైపుచూస్తూ. తోక త్రొక్కిన తాచులాలేస్తూ మహారాజ్ "ఈ దుర్మార్గుడిని తీసుకొని పోయి నూరు కొరడా దెబ్బలు వడ్డించండి. తిరిగీ వీడిని రాజభవనంలో అడుగుపెట్టనీయకండి" అని ఆజ్ఞాపించాడు. రాజుగారి ఆజ్ఞను మహామంత్రి వెంటనే అమలు జరిపించాడు. కొరడా దెబ్బలు తింటున్న మదనుణ్ణి చూచి పరివారమంతా కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వింది.

కొరడా దెబ్బలు తింటున్న మదనుడు మహారాజు వైపు చూస్తూ "మహారాజా! నిన్న శివరాం నిజాన్ని అంగీకరించినందుకు నూరు టంకాలు యిప్పించారు. నేడు నేను

# రాజరికం

అవి అశోకచక్రవర్తి పాలనచేసే రోజులు. అతడు శత్రురాజుల గుండెల్లో బల్లెంలా ఉండేవాడు. అంతే కాదు. అతని పేరు చెప్తే ఇంద్రుడికూ్కడా హడలే!

ఆవేళ చక్రవర్తి పుట్టినరోజు. స్వయంగా పట్నం చూద్దామని బయలుదేరారు చక్రవర్తిగారు అబ్బ' ఆ వైభవం చెప్పలేము. అతడు రాజబాట వెంట పోతున్నాడంటే ముందూ వెనుకా భటులే. వాళ్లు 'చక్రవర్తిగారు వస్తున్నారు. తొలగండి, తొలగండి" అని పదే పదే అరుస్తున్నారు.

రోడ్డు మీద ఉన్న జనసమూహం ఏమయారో ఆ భగవంతుడికే తెలుసు. క్షణంలో రోడ్డు అంతా ఖాళీ అయిపోయింది. అంటే మనుష్యులు లేరనికాదు ఎక్కడివారక్కడ తప్పుకున్నారు; ఒక్క సన్యాసి తప్ప.

అతడు భటులమాట విననట్టే చక్రవర్తి అంబారీకి ఎదురుగుండా వస్తున్నాడు. రాజభటులు ఎన్ని కేకలు వేసినా, ఎంత బెదిరించినా వినడంలేదు. సరిగదా తన చేతిలో ఉన్న ఒక్కమూటా అంబారీలోకి



*   *   *

"బాబూ! పిచ్చివాడు ఏదో తెలియకచేశాడు ఈతప్పు క్షమించి మన్నించండి!"

"అలా వీల్లేదు. కళ్లుకావరమెక్కాయా? చిన్నాపెద్దా అంతరం అక్కర్లేదా? నేనేం సామాన్యుడనుకున్నాడా! రాజాధిరాజులకురాజును స్వర్గాధిపతి దేవేంద్రుడ్ని గూడా శిక్షించే శక్తి సామర్థ్యాలు నాదగ్గర ఉన్నాయి."

"ప్రభువులు అంతవారే కాని..."

"కానీలేదు. గీనీలేదు. వెంటనే వీడ్ని తీసుకుపోయి ఉరితీయండి. నా కళ్లలో పడ్డవాడు మళ్ళీ తిరిగి బ్రతకడం అసంభవం" అంటూ ఆజ్ఞాపిం

అదే నిజాన్ని అంగీకరించినందుకు నూరు కొరడా దెబ్బలు యిప్పించారు ఒకేపనికి ఒకరికి బహుమానము, యింకొకరికి శిక్ష. ఇదేనా న్యాయం?" అని మొరపెట్టుకో సాగాడు.

"ముందు వీడిని బైటకు గెంటించండి" అని ఆజ్ఞాపించాడు మహారాజు మదనుడు పెట్టికొన్న మొరలను పెడచెవిని పెట్టుతూ. ★




చేడు చక్రవర్తి.

## 2

"మహారాజా! ఒక్కమాట..."

ఏమిటీ అన్నట్టు ఒకసారి చూశాడు చక్రవర్తి. చక్రవర్తి ఉద్దేశం అవగాహనం చేసుకున్నాడు సన్యాసి వెంటనే ప్రారంభించేడు.

"నాయనా! నువ్వు దరిద్రుడివి అందుకే ఆమాట నీ అంబారిలోంచి విసిరేను అది ఒట్టి మాట కాదు. బంగారు కాసులమూట."

అశోకచక్రవర్తి ముఖము ఒక్కసారి జేవురించింది. వెంటనే రణధీర్ అని కేకవేసాడు మరు క్షణంలో రణధీర్ ముందుకువచ్చి ఏమిటి సెలవన్నట్లు ఎదురు చూస్తున్నాడు. వెంటనే సన్యాసి "ఆవేశ మెందుకు మహారాజా! ఎలాగూ చావడానికి సిద్ధంగా ఉన్నాను. చచ్చేముందర యీ నాల్గుమాటలు చెప్పనిచ్చి నా ఆత్మకు సంతోషం చేకూర్చు నీకు పుణ్యం ఉంటుంది" అంటూ ప్రాధేయ పడ్డాడు.

ఆజ్ఞలో ఏ మహత్తర శక్తి వుందో యేమోగాని కాటువేయడానికి నల్లత్రాచులా వచ్చిన రణధీర్, చక్రవర్తి "వెళ్లిపో" అన్న మాటలతో వెనక్కు మళ్లాడు ఇంతకీ చక్రవర్తికి కోపం కలగడానికి కారణం—దరిద్రుడనడమే.

తనేమిటి? దరిద్రుడేమిటి? తన అంతర మెక్కడ? వాని అంతర మెక్కడ? తను చక్రవర్తి. అంటే రాజాధిరాజులకు చక్రవర్తి. అపర కుబేరుడు. తన కోశాగారంలోని వజ్ర వైడూర్యాలు లోకంలోలేవు. తన కోటలో ఎక్కడ జూచినా బంగారు, వెండిరాసులు కుప్ప తెప్పలుగా ఆకాశానికి నిచ్చెన వేస్తున్నాయి. అలాంటి తన్ను దరిద్రుడన్నాడు సన్యాసి. అంతే కాకుండా బంగారుకాసులమూట విసిరేడు. అందుకే తను తన సర్వసైన్యాధికారి రణధీర్‌ను పిలిచిందికూడా.

"నాయనా! నామాటలు సావధానంగా వింటే నీకంతా అర్థమవుతుంది. నేను మొదట్లో నీలాగే ఒక రాజును." సన్యాసిని ఆశ్చర్యంగా చూసేడు చక్రవర్తి.

"ఔను! నువ్వు చాలా ఆశ్చర్య పడుతున్నావ్—రాజేమిటి! ఇలా ఉండడ మేమిటి అని, కాని మానవుడు ఎంతవాడైనా—జీవిత పరిణామంలో ముందు వెనుకలకు పోలిక లేకుండా కరిగి ముద్దలా మారి పోతాడు. ఒకప్పుడు నేనూ నీలాగా అంబారిలో ఊరేగేను. నీలాగే

భోగాలు అనుభవించాను. ఈ రాజరికంలో మనచుట్టూ కారుచీకట్లు కమ్ముకొని మనల్ని అంధులనుచేస్తాయనే సంగతి—ఇప్పుడు—నీవలెనే—అప్పుడు నాకూ తెలీలేదు. కాని తర్వాత 'రాజరికం' అనే గంత కళ్ళకు పట్టుకొని నావలెనే గుడ్డివాళ్ళైన చాలామందికి—ధర్మబోధ చెయ్యడానికి యీఅవతారం దాల్చి తిరుగుతున్నాను.

నాయనా! నామాటలు కొంచెం శ్రద్ధగా విను. నువ్వు దరిద్రుడు వంటే చాల ఆశ్చర్యం కలిగింది కోపం కూడా కలిగింది. అందుకే నువ్వు రణధీర్‌ని పిలిచిందికూడా.

కాని ఒక్కసారి దీర్ఘంగా ఆలోచించు. అప్పుడు నీకు దరిద్రుడన్న పదంలోని అంతరార్థం బోధపడుతుంది.

"నువ్వు చక్రవర్తివి. నీకు కావలసినంత రాజ్యముంది. ధనముంది. నీ కోశాగారంలోలేని వజ్ర వైఢూర్యాలు 'నభూతో నభవిష్యతి.' నీ కోటలోని బంగారు వెండి రాసులు స్వర్గానికి మెట్లు కడుతున్నాయి. అయినా నీకు సంతోషమూ, సంతృప్తి లేదు. ఇంకా ఎన్నో రాజ్యాలు గెల్చి ధన మింకా సంపాదిద్దామని, ఎన్నో నరహత్యలు, గృహ దహనాలు చేద్దామని నీ మనస్సు ఉవ్విళ్ళూరుతోంది. "ఉన్నదాంతో ఎవడు సంతృప్తి పొందుతాడో వాడే నిజమైనరాజు, చక్రవర్తిన్నీ. కాని కిరీటము పెట్టుకొని, రాజభటుల్ని వెంటబెట్టుకొని, రాజలాంఛనాలతో అంబారీపై ఊరేగినంతమాత్రాన వాడు రాజుకాదు. వాడే నిజమైన దరిద్రుడు."

## 3

అశోకచక్రవర్తికి కళ్లవెంట నీళ్లు గిర్రున తిరిగాయి. దరిద్రుడన్న పదానికి అంతరార్థం అతని కిప్పుడు బోధపడింది. సన్యాసి చెప్పిన మాట నిజమే! తనకు కావలసినంత రాజ్యముంది, ధనముంది అయినా తన కింకా సంతోషము, శాంతి లేదు. ఒక్కసారి అతనిలో సంచలనం కలిగింది. దాంతో పరివర్తనకూడా కలిగింది.

గతమంతా జ్ఞప్తికి వచ్చింది. ఒక దాని వెనుక ఒకటి స్మృతిపథంలో మెదిలాయి. కళింగయుద్ధంలో తను చేసిన నరహత్యలు, ఘోరాలు, గృహదహనాలు, ఒక్కసారి కళ్ళకు కట్టాయి. రక్తపుటేరులో కొట్టుకుపోతున్న మానవ కళేబరాలు, యుద్ధంలో వికలాంగులైన సైనికుల ఆర్తనాదాలు, అమాయకపు ప్రజల వేడి నిట్టూర్పులు, ఏడ్పులు అన్నీ స్పష్టంగా అగుపించేయి. ఒక్కసారి గుండెమీద చెయ్యివేసి చూచుకొన్నాడు. 'నువ్వు చేసింది తప్పు' అని అంతరాత్మ బోధించింది. రాయికంటె గట్టిదైన అతని హృదయం, నవనీతంలా కరిగిపోయింది. 'నాతప్పు క్షమించండి. 'రాజరికం' అనే గంత కళ్లకు కట్టుకొని అజ్ఞానంలో కొట్టుమిట్టాడుతున్న నాకు కన్నులు తెరిపించి ధర్మజ్యోతి వెలిగించిచూపారు. నేటినుండీ నేను యుద్ధం చెయ్యను. ఈకళింగయుద్ధమే నా తుదియుద్ధము అని అశోకుడు సన్యాసికాళ్లమీద పడ్డాడు.

"నాయనా! ఇప్పటికైనా పశ్చాత్తాపపడ్డావు. 'రాజరికం' అనే అజ్ఞానంనుంచిమేలుకొన్నావు. నాకు అంతే చాలు" అంటూ సన్యాసి వెళ్లిపోయాడు.



### గమనిక

అక్టోబరు 23 వ తేదీ ఆంధ్ర వారపత్రికలో 'నాగేశ్వరరావు సన్మాన' వార్త క్రింద, ఆయనకు రోటరీ పతకం ఇచ్చినది వరంగల్ రోటరీ క్లబ్ అని గమనింప ప్రార్థన.

# ఆంధ్రప్రదేశ్

(3-వ పేజీ తరువాయి)

...న్నారు. రెండవ పంచవర్ష ప్రణాళిక ఆశయాల కనుగుణంగా ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి అవుతున్నదా? [illegible]మనను మనం ప్రశ్నించుకోవాలన్నారు.

మీలో లంచగొండితనం రూపుమాసిందా అని ప్రభుత్వోద్యోగులను, ప్రజలను మోసగించి అధికలాభాలు సంపాదించే ధోరణిని వదలిపెట్టారా అని వర్తకులను, మీరు అధికోత్పత్తికి కృషిచేశారా లేక వ్యాపార పంటలను ఎక్కువ చేయడానికే కృషిచేశారా అని వ్యవసాయదారులను, హక్కులకోసం పోరాడుతూ అధికోత్పత్తికి భంగం కలిగించారా అని కార్మికులను, ఇలాగే తలిమా అన్నివర్గాల ప్రజలను ఆయన ప్రశ్నించారు. ఆంధ్రప్రదేశ్ ను భూతలస్వర్గంగా నిర్మించడానికి కృషిచేద్దామని ఆయన ప్రజానీకాన్ని ప్రబోధించారు. 

# రావు రాబడి

(19-వ పేజీ తరువాయి)

రాసుకున్న లెల్లప్రకారం. అయా హోటళ్ళపేర్లూ, కిళ్ళీకొట్ల పేర్లూ, సినిమాహాలు పేర్లూ మొదలగునవి సందర్భానుసారంగా ఉపయోగించబడ్డాయి. వాళ్ళంతా తెల్లపోయి చూస్తున్నారు. దీనికేనా వీళ్ళింత డబ్బిస్తుంట అని.

"మరేమిటనుకున్నావు రా పబ్లిసిటీ అంటేనూ! మనం కథలో ఒక హోటల్ పేరు వాశేమూ అంటే, ఆ హోటలు మర్నాడు క్రిక్కిరిసి వుండవల్సిందే! తెలుసా!" రావు గర్వంగా అన్నాడు.

రావు ఒక పేరుకెక్కిన రచయిత. గొప్ప కథానికలు వ్రాస్తాడని పేరు ప్రసిద్కెక్కిన వాడు. ఏపత్రికైనా అతను వ్రాసిన కథలను వెంటవెంటనే ప్రచురిస్తుంది. కొన్ని పత్రికలు రావుని కోరి వేడి కథలు వ్రాయించుకుంటాయి. పాపం రావు గొప్ప రచయితే అయినా, రచనలవలన పత్రికలద్వారా వచ్చే రాబడి ఏమీ లెక్కలోకి రావడంలేదు. కాలం మాత్రం ఖర్చవుతూంది. ఈ అదను చూసుకుని ఒకరిద్దరు వ్యాపారస్తులను మంచి చేసుకొని వాళ్ళ కొట్లపేర్లు తన కథల్లో ఉపయోగించి, మంచి పబ్లిసిటీ ఇచ్చారు. ఇంక అప్పటినుంచీ ప్రతివ్యాపారస్థుడూ తమ బిజినెస్ అభివృద్ధి చేసుకోవాలంటే, రావు కథల్లో వాళ్ళ షాపుపేరు వ్రాయించుకోవాలి అనే నిర్ణయానికివచ్చి అతను కోరినడబ్బు ఇస్తున్నారు. ఎక్కడో ఒకవాక్యం రాస్తాడు "జానకితో కలసి శేఖర్ వివేకాహోటల్ లో చల్లని ఫేన్ క్రింది కూర్చుని చక్కని కాఫీ సేవించాడు" అన్నట్లుగా అని. ఆ మర్నాటి నుంచి రావు పాఠకులద్వారా ఫలానా కాఫీ హోటలు ప్రత్యేక స్థానం ఆక్రమించుకుంటుంది. ఈ విధంగా రావు రాబడి గెజిటెడ్ ఆఫీసరు రాబడిని మించిపోయింది. 

# ★ బొంబాయి సినిమా లేఖ ★

దీపావళి పండుగ పేరుచెప్పి, ఈ చిత్రసీమలో బోలెడన్ని విందులు జరిగాయి. వాటిలో దీపావళికి దీటైనవీ తిరునాళ్ళ అనిపించేలా తారావళి యాత్రతో పాల్గొని పండుగలా జరిపిన విందులు మూడున్నాయి. ఒకటి షమ్మీకపూర్ ఇంట జరిగింది. ఇంకోటి నిర్మాత గోపాల్ దాస్ సిప్పీ, గ్రీన్ లార్డ్ హోటల్లో చేసినది. మూడోది దర్శక నిర్మాత మహబూబ్ ఖాన్ తన స్టుడియో ఆవరణలో ఏర్పాటుచేసినది.

షమ్మీకపూర్ దీపావళికి ముందురోజున విందు చేశాడు. ఆరాత్రి వాళ్ళ ఇంటి ముందున్న నందనవనం, రకరకాల, రంగు రంగుల దీపావళిలో శోభాయమానంగా, స్వర్గలోక ప్రసెట్ లా వెలిగింది. ఆవేళ అతని పుట్టినరోజు. షమ్మీకపూర్ భార్య గీతా (బాలి) కపూర్ ఒక్కొక్కళ్ళకి పదిసార్లు మరీమరీ రమ్మని చెప్పినందువల్ల, ఎవరిమటుకు వాళ్ళు ఆ అభిమానానికి ముగ్ధులై మంచి ఉత్సాహంగా వచ్చారు (వేమనాక్, బీనారాయ్, దిలీప్ కుమార్, చేతన్ ఆనంద్, శంకర్, జైకిషన్, కామినీకౌశల్, శేఖర్, కె. ఆసిఫ్, షమ్మీసోదరుడు రాజ్ కపూర్ ఇంకా ఎందరో వచ్చి శుభాకాంక్షలు తెలిపారు. 'శీరాజన' అనే మధురపానీయం అత్తరాలా నీళ్ళలా చెల్లిపోయింది. అనక 'బుఫేడిన్నర్' (ఎవరిమటుకు వాళ్ళు కావలసింది వడ్డించుకు తినేవిందు) జరిగింది. విందులు హుషారుగా ఉండాలంటే, అందుకు ఈపద్ధతి ఉత్తమం.

హాస్యనటులు జానీవాకర్, ఆగాలు బోల్డు తమాషాలతో అందర్నీ బాగానవ్వించారు. భోజనాల తరవాత గానసభలో భోపాల్ కు చెందిన షకీలాభాను అనేఅమ్మాయి కవాలీలు పాడింది. ఈ అమ్మాయి రంభాద్యప్సరసల్ని ఓడించే సౌందర్యవతేమీ కాదు. పాటలో కూడా ఈమెతో పోటీ చెయ్యడానికి గంధర్వులు ఏమాత్రం జంకరు. మామూలుమాత్రం బాగానే ఉంటుంది. అయినా, ఈనాడు ఈ షకీలా భాను బొంబాయి విందుల్లో, ఇందుగల డందు లేదనిపించే ఏర్పాటులో ఉంది. ఇక్కడి ఫిలిం జనాభాని ముగ్ధుల్ని చేయగల ప్రతిభ ఏమిటో తెలీదు.

ఆమధ్య 'నయాదౌర్' చిత్రం ఔట్ డోర్ దృశ్యాలు తీయడానికై ట్రూప్ బృందం భోపాల్ వెళ్ళింది. అప్పుడు ఈ షకీలాభాను దిలీప్ కుమార్, జానీవాకర్ ప్రభృతులకు కూర్చోపెట్టి పాడి వినిపించిందట. తరవాత భోపాల్ నుండి బొంబాయికి తరలివచ్చింది. ఇక్కడే స్థిరపడాలని ఈమెకి 'ప్లేబాక్' పాడే అవకాశాలు ఇప్పించాలని జానీవాకర్ గట్టిగా సిఫార్సులు చేస్తున్నాడు. అయితే, పైన చెప్పిన కారణాలవల్ల, ఈమె



భారత చలనచిత్ర పరిశ్రమకు భూషణప్రాయమనదగ్గ 'మదరిండియా' చిత్రంలో నర్గీస్.

ఎస్ డి నరాంగ్ నిర్మిస్తున్న 'ఢిల్లీ కాఠగ్' చిత్రంలో నూతన్

## బొంబాయి లేఖ

పాట విన్న ఏ సంగీత దర్శకుడూ 'సోలో' కాదుగదా, బృందగానంలో కూడా అవ కాశం ఇవ్వడానికి జంకుతున్నాడు

మొత్తంమీద, షమ్మీకపూర్ పుట్టిన రోజు పండుగ విందు, బొంబాయి చిత్ర సీమలో అపూర్వం అనిపించుకునేటంత హుషారుగా జరిగింది

## 'చిత్ర' జన్మదినం

సిప్పీఫిలింస్ అధిపతి గోపాల్ దాస్ సిప్పీ, "గ్రీన్ హోటల్"లో పెదఎత్తునవిందు చేశాడు సిప్పీఫిలింస్ చిత్రం 'సోలా ఆ సేకు 'పుట్టిన రోజు పండగ' పేరుతో ఈ విందు జరిగింది ఈ చిత్రంలో నాయకుడు దేవానంద్, 'బర్త్ డే కేక్'ను కోసి ప్రారంభోత్సవం లాటిది చేశాడు ఇందులో నాయిక దేవ్ భార్య కల్పన ఆనంద్—ఆమె కొరణాంతరాల వల్ల ఆవేళకు రాలేకపోయింది విందుకు నూతన్, వహీదా రెహమాన్, నిమ్మి, షమ్మీ, ■ ఎస్ జోహార్, జానీవాకర్, భరత్ భూషణ్, అశోక్ కుమార్, షమ్మీకపూర్ గీతాకపూర్ మొదలగువారంతా వచ్చారు విందు తరవాత, ఒక భారీ నర్తకి హవాయి డాన్సుచేసింది క్రిస్టియన్ దంపతుల జంట రాక్ ఎండ్ రోల్ డాన్సుచేసింది రెండూ హుషారుగా ఉన్నాయి

'పుట్టినరోజు' చేసుకున్న ఈ 'సోలా ఆ సే' చిత్రం కథను, రెండేళ్ల నాడు దేవ్, కల్పన వివాహం చేసుకున్న సందర్భంలో నటుడు బల్ రాజ్ సాహ్నీ కానుకగా ఇచ్చాడు దాన్ని ఇపుడు ఆనంద్ పాల్ నిర్మిస్తున్నాడు దేవ్, కల్పన నటిస్తున్నారు దర్శకుడు రాజ్ ఋషి

దీనితోపాటు సిప్పీ రెండవచిత్రం "క్రిమి నల్"ను కొత్త నటుడు రమేష్ ఆనంద్ చేత కూడా ఇదేపద్ధతిలో ప్రారంభోత్సవం జరి పించరు



'ఖోటాపైసా' చిత్రంలో దొరసానమ్మ వేషంకట్టిన జానీవాకర్

## విమర్శకులకు విందు

మూడో విందు, దర్శకనిర్మాత మహబూబ్ తన స్టుడియో ఆవరణలో ఇచ్చినది దీనికి అతిథులు బొంబాయిలోని ఫిలింవిమర్శకులు



చెకొస్లొవాకియా అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో ప్రథమబహుమతి గడించిన చిత్రం 'జాగ్ తేరహో' నిర్మాత, ముఖ్యనటుడూ అయిన శ్రీ రాజ్ కపూర్ ను విజయవాడలో నవయుగ ఫిలింస్ వారు ఇటీవల సత్కరించారు సభాధ్యక్షుడు శ్రీ ఎల్ వి ప్రసాద్, బహుమతి నందిస్తున్న నటుడు శ్రీ ఎస్ వి రంగారావు, శ్రీ రాజ్ కపూర్

'మదర్ ఇండియా' చిత్రం విడుదల సందర్భాన మహబూబ్ ఈ విందుచేశారు నర్గీస్, రాజ్ కుమార్, రాజేంద్రకుమార్, శ్రీమతి మహబూబ్ అతిథులకు స్వాగతమిచ్చి మర్యాదచేశారు అనంతరం మహబూబ్ లండన్ ప్రయాణం విశేషాలను, అక్కడి పరిస్థితులను వివరించారు లండన్ పత్రికా రచయితలు చూపిన గౌరవాదరాలు తనకు చాలాసంతోషం కలిగించాయన్నారు కాగా మదరిండియా విషయం ప్రస్తావించి, "నేడు కాపోతే రేపైనా, ఈ చిత్రాన్ని ప్రపంచ వ్యాప్తంగా విడుదల చేయడం జరిగి తీరుతుందని ఆయన అన్నారు "ఈసారి నాకు కావలసింది డబ్బు, ప్రతిష్ఠమాట దేవుడెరుగు అందుకనే, విడుదలకై అక్కడ వచ్చిన బేరాలు కొన్నిటిని, లాభసాటి కానందువల్ల తిరస్కరించవలసి వచ్చింది" అని మహబూబ్ వివరించారు

'మదరిండియా' చిత్రాన్ని బ్రిటన్‌లో విడుదలచేయడానికి మటుకు ఏర్పాట్లు జరిగాయి కొలంబియా పిక్చర్స్ వారు అందుకై ఈచిత్రాన్ని కొన్నారన్నవిషయం విదితమే. ★

## ★ వార్తలు ★

"ప్యాసా" దర్శక నిర్మాత గురుదత్, తన కొత్త చిత్రం "గౌరి"ని అంతర్జాతీయ స్థాయి ప్రదర్శనకై ఆంగ్లంలోకూడా నిర్మించ నిశ్చయించాడు మొదట బెంగాలీలో మాత్రమే తీయాలనుకోవడం విదితమే ఆంగ్ల చిత్రం నిడివి పదివేలకు మించదట దీన్ని సినిమా స్కోప్‌లో 'షూట్' చేస్తున్నారు అజ్ఞాతవాసంచేస్తున్న 'శ్రీ హైడెడ్ కోబ్రా' అను "బాంబే ఫయిట్ 417" (ఫిలింస్థాన్ వారిది) తరువాత సినిమా స్కోప్‌లో తయారయే తొలి భారతీయ చిత్రం ఇదే గురుదత్, ఆయన భార్య గాయని గీతా (రాయ్) దత్ లు రెండిటిలోనూ ముఖ్యపాత్రలు నిర్వహిస్తున్నారు ఆంగ్ల చిత్రానికి ఉమాఆనంద్ సంభాషణలు వ్రాస్తున్నది నిర్మాణం కొంత సాగిన తర్వాత, ఆంగ్ల సంభాషణల ఉచ్చారణాదికాలపై ప్రవీణుల అభిప్రాయాలు తెలుసుకొని, అవసరమైతే ఇందులో పాత్రధారులకు వేరే గాత్రధారులను నియోగించడం జరుగుతుందని గురుదత్ చెప్పారు

ఈ చిత్రానికి ఛాయాగ్రహణ దర్శకుడు వి కె (ప్యాసా) మూర్తి సంగీత దర్శకుడు ఎస్ డి బర్మన్

### 'ట్రైసికిల్'

బసుచిత్ర ('బందిష్') మందిర్ వారు తమ కొత్తచిత్రం 'ట్రైసికిల్' నిర్మాణం అంధేరీలోని నాబహార్ స్టుడియోలో గతవారం ఆరంభించారు ప్రారంభ సన్నివేశంలో బాలనటి డెయిసీ ఇరానీ పాల్గొంది

(54-వ పేజీ చూడండి)



శ్రీ సారథీ స్టుడియోస్‌వారి 'ఎత్తుకు పైఎత్తు' చిత్రంలో నాయకపాత్ర నిర్వహిస్తున్న కొత్తనటుడు బాలయ్య, నాయిక జానకి



నందీవారి "కృష్ణగారడీ"లో రేవతి, జగ్గయ్య

*   *   *



శ్రీ వెంకటరమణా ఫిలింస్‌వారి తొలిచిత్రం 'బాలనాగమ్మ' నిర్మాణానికి ఇటీవల రేవతీ స్టుడియోలో, శ్రీ త్రివిక్రమరావు, (శ్రీ రామారావు ప్రక్కనున్నవారు) ప్రారంభోత్సవం జరిపారు

# సినిమా వార్తలు

## 'ఎత్తుకు పైఎత్తు'

సారథీ స్టుడియోస్ వారి కొత్తచిత్రానికి, 'ఎత్తుకు పైఎత్తు' అని పేరుపెట్టారు. చిత్రనిర్మాణం దాదాపు పూర్తికావచ్చింది

ఈ చిత్రంలో సారథి అధిపతి శ్రీ రామకృష్ణప్రసాద్ తెలుగు ప్రేక్షకులకు ఒక కొత్త నటుడిని పరిచయం చేస్తున్నారు అదీ ప్రధానభూమిక ద్వారా ఆ నటుడి పేరు ఎం బాలయ్య అని మీకు తెలుగు కలసికట్టు తనం దేశానికి ఆయువుపట్టువంటిదనీ, అభ్యుదయోన్నతికి విద్య ముఖ్యమైనదనీ నిరూపించి ప్రబోధించే పాత్రను బాలయ్య నిర్వహిస్తున్నారు

## తెరమీద తొలిసారి

దర్శకుడు చాణక్య గ్రామీణ జీవనంలో మధురఘట్టాల నవనీకం ఇందులో పొందు పరుస్తూ చిత్రాన్ని రూపొందిస్తున్నారు ఈ చిత్రంలో విశేషాకర్షణ ఒక సుస్వరం నాట్యం చేయడం వెండితెరమీద ఇటువంటి నృత్యానికి ఇదే తొలిసారి అవుతుంది దీన్ని సాధించడానికై సారథి నిర్మాతలు పలు ప్రాంతాలలో అన్వేషణ జరిపి, చెప్పినటు విని 'డాన్సు' చేసే చురుకుదనంఉన్న సుస్వరాన్ని సంపాదించుకొచ్చారు

ఈ చిత్రంలో నాయిక జానకి నాగయ్య, రేలంగి, సి ఎస్ ఆర్, సుమ్మడి, లక్ష్మిరాజ్యం మొదలగువారు ప్రముఖ భూమికలు నిర్వహిస్తున్నారు

రచన నార్ల చిరంజీవి సంగీత దర్శకుడు వేణు

ఈ చిత్రాన్ని త్వరలోనే విడుదలచేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి

## 'బాలనాగమ్మ'

శ్రీ వెంకటరమణా ఫిలింస్ వారి తొలి చిత్రం 'బాలనాగమ్మ' షూటింగ్ ప్రారంభోత్సవం అక్టోబరు 27 రాత్రి పదింటికి రేవతీ స్టుడియోలో జరిగింది నిర్మాతలు బి ఎస్ రాజు, డి ఎన్ రాజు, సంగీతదర్శకుడు టి వి రాజు అతిథులకు స్వాగతమిచ్చారు నటులు ఎ నాగేశ్వరరావు, రేలంగి వెంకటరామయ్య, నిర్మాతలు ఆదినారాయణరావు, శేషాచలంచెట్టి, రేవతి అధిపతి శ్రీనివాస రాఘవన్, శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్ రాజుగారలు పూజకువచ్చి శుభాకాంక్షలు తెలియచేశారు

ముఖ్యనటుడు ఎన్ టి రామారావు, బాలవర్ధిరాజు భూమికలో కదనరంగానికి కదలివెళ్ళేవేళ కులదేవతను కొలిచి బయలుదేరే ఘట్టాన్ని ఆరోజున చిత్రించారు నేషనల్ ఆర్ట్ థియేటర్సు అధిపతి త్రివిక్రమరావు కామెరా స్విచ్ ఆన్ చేశారు.

## పొన్నలూరివారి
## మూడవ కానుక

పొన్నలూరు (భాగ్యరేఖ) బ్రదర్స్ వారు తమ తృతీయ చిత్రానికి జానపదగాధను తీసుకొన్నారు. ఈ చిత్రం పేరు 'దైవబలం' దీన్ని తెలుగులోను, తమిళంలోను కూడా నిర్మించ నిశ్చయించారు. రచన మొన్ననే ఆరంభం అయింది. ఈ చిత్రానికి, పొన్నలూరి స్టుడియో కథా శాఖవారు కథను రూపొందించారు. మాటలు జె (నాగుల చవితి) పరశురాం, పాటలు సముద్రాల, అనిసెట్టి వ్రాస్తున్నారు. సంగీత దర్శకుడు అశ్వత్థామ.

ఈ సంస్థ అధిపతి వసంతకుమార్ రెడ్డిగారే 'దైవబలం' చిత్రానికి దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

వీరి రెండవచిత్రం 'శోభ' నిర్మాణం పూర్తికావచ్చింది. సంక్రాంతికి విడుదల చేస్తామని తెలియజేస్తున్నారు.

## రాజనందిని

జలరుహా ఫిలింస్ వారి "రాజనందిని" వేదాంతం రాఘవయ్య దర్శకత్వాన చురుకుగా తయారవుతోంది. అంజలీదేవి, రామారావు, రేలంగి, ఆర్. నాగేశ్వరరావు మొదలగువారు నటిస్తున్నారు. రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రి, సంగీత దర్శకుడు టి. వి. రాజు. 

## ఆన్నా - నాన్నా

హాలీవుడ్ నటుడు మార్లాన్ బ్రాండో భార్య అన్నా(కాష్ఫి) బ్రాండో భారతీయ యువతి ఔనా కాదా అన్న ప్రశ్న గురించి ఆ అమ్మాయీ ఆమె భర్తా తప్ప మిగతా వాళ్లంతా వాగ్వాదాలతో, వాకబులు చేయడాలతో నానా గొడవా పడుతున్నారు. లండన్‌లో ఒక అమ్మాయి తనూ, అన్నా కలిసి కొన్నాళ్లు ఒకే గదిలో ఉండడం జరిగిందనీ, అన్నా, భారతీయ యువతేనని తనకు గట్టిగా తెలుసుననీ చాలా గట్టిగా చెబుతోంది.

అన్నా బ్రిటిష్ దంపతుల కూతురే ననీ, ఆ సంగతి తనకి బాగా తెలుసుననీ ఇంకో అమ్మాయి ఇంకా గట్టిగా చెబుతోంది. తన తండ్రి అని అన్నా చెబుతున్న దేవి కాష్ఫి అనే మనిషిని ఎవరూ కనీ వినీ ఎరగరనీ, 'దేవి' అన్న పేరు అలా ఉండగా అసలు 'కాష్ఫి' అనే ఇంటిపేరు ఎక్కడా లేదనీ, ఇంకో ఆసామి కనుక్కొని తేల్చాడు.

సినిమా పత్రికలన్నీ ఈ అన్నా, వాళ్ల నాన్నా కథమీద "పెద్దపెద్ద హెడ్డింగుల"తో సీరియల్ కథలు నడుపుతున్నాయి. కొందరు డిటెక్టింగు కూడా ప్రారంభించినట్టు వినికిడి.



"ఎత్తుకు పైయెత్తు' లో గుమ్మడి, బాలయ్య



జలరుహావారి 'రాజనందిని' చిత్రంలో రేలంగి, రామారావు

* * * *

విరల్ ప్రొడక్షన్స్‌వారి 'వద్దంటే పెళ్ళి' చిత్రంలో పశుపతిగా చలం



ఇంతకీ అవా, బ్రాండోలు దీన్ని గురించి పట్టించుకోటమే లేదు. వాళ్ళిద్దరూ అరిజోనా (అమెరికా) రాష్ట్రంలోని పల్లెసీమలలో నిలచినచోట నిలవకుండా షికారుగా విహరిస్తున్నారు. ఒకచోట వాళ్ళు నిలచినప్పుడు, ఒక గృహిణి ఉండబట్టలేక "మీ నాన్న బ్రిటిష్ వాడటగా" అని అడిగేసింది.

అవా, ఆమె భర్త బ్రాండో ఒక్క క్షణం మొహా మొహాలు చూసుకున్నారు. అమాంతం విరగబడి నవ్వేశారు. నవ్వడం అయిపోయాక 'ఔను కాదు' అని జవాబిస్తారని ఆ ప్రశ్న వేసిన గృహిణి ఆశపడింది. కాని, నవ్వడం అయిపోయాక, వాళ్ళిద్దరూ కారెక్కి మళ్ళీ ఇంకోసారి నవ్వేసి ఉడాయించారు. ★



మొన్న దీపావళి పండుగరోజున ఎగ్మూర్ డ్రామెటిక్ సొసైటీ ఆధ్వర్యాన మద్రాసు అన్నామలై మందిరంలో గాయనీమణులు హీరాబాయ్ బరోడ్కర్, సరస్వతీ రానేల గానసభ జరిగింది. మద్రాసులోని సంగీతాభిమానులు, విద్వాంసులు, చలనచిత్ర సంగీత దర్శకులూ మొదలగువారనేకులు విని ఆనందించారు. ఆ గాయనీమణులను అభినందిస్తున్న మద్రాసు తాత్కాలిక గవర్నర్ శ్రీ పి. వి. రాజమన్నార్.

# వార్తలు

(51 వ పేజీ తరువాయి)

ఇందులో నాయికా నాయకులు వహీదా రెహమాన్, కిశోర్ కుమార్. ఇతర ముఖ్య నటులు బిపిన్ గుప్త, నజీర్ హుసేన్, లలితా పావర్, జగదీప్. సంగీతం హేమంత కుమార్. దర్శకుడు సత్యేన్ బోస్.

## 'సితారోంసే ఆగే'

సత్యేన్ బోస్ దర్శకత్వాన తయారవుతున్న మరో చిత్రం నరసూ స్టుడియోస్ వారి 'సితారోంసే ఆగే'. ఇందులో వైజయంతిమాల, అశోక్ కుమార్ పాల్గొంటున్నారు. ఈ చిత్రం ఈ నెలాఖరులోగా, తప్పితే, డిసెంబరు తొలివారంలో విడుదల కాగలదని అంటున్నారు.

దీనికి సంగీతదర్శకుడు హేమంత కుమార్.

ఈ నెల రెండోవారంలో విడుదల కాగల చిత్రం దర్శక సొహ్రాబ్ మోడీ నిర్మించిన 'నౌషెర్వాన్ ఎ ఆదిల్'.

## అపరాజితుడు

ఈ ఏడాది అంతర్జాతీయ చలనచిత్రోత్సవాలలో బహుమతులు గడించుకొన్న భారతీయ చిత్రనిర్మాతలకు ఫిలిం ఫెడరేషన్ ఇటీవల బొంబాయిలో సన్మానం జరపడం విదితమే. ఆ సన్మానానికి పిలిచిన వారిలో 'జాగ్ తేరహో' నిర్మాత రాజ్ కపూర్, 'అపరాజిత' ప్రఖ్యాత సత్యజిత్ రాయ్ ప్రభృతులున్నారు. కాని వెళ్ళినవారిలో సత్యజిత్ రాయ్ లేడు. అతను ఆ సన్మాన సభకు వెళ్ళక పోవడానికి కారణం వివరిస్తూ "అపరాజిత" చిత్రంనిర్మాతగా కాక, దర్శకుడిగా వెనిస్ ఉత్సవంలో నన్ను మన్నించి బహుమతి ఇచ్చారు. అందువల్ల నేను కళాకారుడిగా మాత్రమే అభినందనలను అందుకోగలను. బొంబాయిలో రాజ్ కపూర్ ను "జాగ్ తేరహో" నిర్మాతగా సన్మానిస్తున్నారు. అందువల్ల నేను రాలేను అని సన్మాన సభ నిర్వాహకులకు తెలియచేశాను" అని విస్పష్టంగా చెప్పారు.

ఈ అభ్యంతరం విన్న మీదట తామూ అందుకు అంగీకరించి, సృజనాత్మక ప్రతిభ చూపిన దర్శకుడిగానే రాయ్ ని సన్మానించ దలచినట్టు కబురంపారని సభనిర్వాహకులు చెబుతున్నారు. ★

## ముదావహం

ఉత్తమశ్రేణి చిత్రాల కోవలోని మెహబూబ్ ప్రొడక్షన్స్ వారి "మదర్ ఇండియా" చిత్రంపట్ల ప్రశంసాసూచకంగా, ఒక విధంగా సన్మానం అనదగ్గ రీతిన బొంబాయి ప్రభుత్వం ఆ చిత్రంపై వినోదపు పన్నును రద్దుచేసింది. ఇప్పటికి వసూలు చేసిన మొత్తాన్ని తిరిగి ఇచ్చివేయ నిశ్చయించింది.

ఇదే విధంగా శాంతారాం కొత్త చిత్రం "దో ఆంఖే బారాహాత్"కు కూడా పన్ను మినహాయింపు వర్తింపచేయ నిశ్చయించింది.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి) ★



ఎర్నెస్ట్ హెమింగ్ వే నవల 'ది సన్ ఆల్సో రైజెస్' ఆధారంగా అదేపేరిట తయారవుతున్న చిత్రంలో ఒక సన్నివేశం. ముందున్న నటుడు టైరోన్ పవర్



సింద్రీలోని "అభ్యుదయ అమెచ్యూర్" నాటకసంఘంవారు ఇటీవల శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి, 'వద్దంటే పెళ్ళి' నాటకం ప్రదర్శించారు అందులో పాల్గొన్న నటులు

# రసవంతమైన ప్రదర్శనం "కుమ్మరి మొల్ల"

తెలుగులో రామాయణం రచించిన కవయిత్రిగా కుమ్మరి మొల్ల ప్రసిద్ధి కెక్కినది చారిత్రికంగా ఆవిడ జీవితవిశేషాలు మనకేమీ తెలియవు తెనాలి రామకృష్ణుని సమకాలికురాలుగా కొన్ని బూటుకథలు మాత్రం ప్రచారంలో ఉన్నాయి ప్రజలకి బాగా తెలిసిన ప్రతి కవినిగూర్చి ఏవో కట్టుకథలు, వీలయితే బూటుకథలు అల్లి చెప్పుకోవడం మనకి మొదటినుంచీ ఉన్న సంప్రదాయమే కుమ్మరి మొల్లనుగూర్చి కూడా అలాంటికథలే కొన్ని ఉన్నాయి వీటన్నిటినీ పరిహరించి మొల్లను వ్యక్తిగా, కవయిత్రిగా అపారమైన గౌరవభావంతో చిత్రిస్తూ శ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావు ఒక నవల రచించారు ఈ నవల ఆధారంగా శ్రీ బి వి ఎన్ ఆచారి రచించిన నాటకం "కుమ్మరి మొల్ల" అక్టోబరు 27 వ తేదీన మదరాసు అణ్ణామలై మందిరంలో రవి ఆర్ట్సు థియేటర్సువారు ప్రదర్శించారు

చరిత్రాత్మక నాటకమైనా ఇందులో ఆధునిక భావాలు పుష్కలంగా ఉన్నాయి గ్రామాల్లో పంచాయతీ సభ్యులుగా, పెదమనుషులుగా, మఠాధికారులుగా చెలామణీ అయ్యేవారు చేసే మోసాలు, ధనవంతులు పేదలమీద సాగించే అక్రమాలు, పేదవాళ్ళ విప్లవధోరణి – వీటికి ఈ నాటకంలో చాలా ప్రాముఖ్యం ఉంది కుమ్మరిమొల్ల పేదవాళ్ళకు అన్యాయం జరుగుతుంటే సహించలేని వ్యక్తి దౌర్జన్యాన్ని దౌర్జన్యంతోనే ఎదిరించాలనే మనిషి ఈవిడలో శ్రీరామకటాక్షంవల్ల కవిత భావాలు, భక్తిభావాలు ప్రవేశించకముందు విప్లవభావాలే, ప్రబలంగా ఉండేవని ఈ నాటకం తెలుపుతుంది అందుచేత ఈ నాటకం చూస్తూ ఈ కాలపు చరిత్రను, ఇప్పటి ప్రజాసమస్యలను చూస్తున్నట్లు అనిపిస్తుంది అయితే రచయిత నేర్పుగా ప్రజల ఆర్థిక సమస్యలతో పారమార్థిక సమస్యలను మేళవించి ఎక్కడా ఔచితి చెడకుండా రసవంతమైన రచన చేయడంవల్ల ప్రదర్శన ఎంతో రక్తికట్టింది ఆ రోజుల్లో బహుశా ప్రజల సమస్యలు

## ఎం. జి. ఎం. అధిపతి మృతి

ప్రఖ్యాత చలనచిత్ర నిర్మాత, మెట్రో గోడ్విన్ మేయర్ సంస్థ అధిపతి అయిన లూయిస్ బి మేయర్ అక్టోబరు 29 న హాలివుడ్‌లో మరణించారు పాతిక సంవత్సరాల అనుభవం గడించిన మేయర్ చిరస్మరణీయములైన చిత్రాలు అనేకం నిర్మించారు పెద్దపెద్ద నటులను పరిశ్రమకు అందించారు మేయర్ ఘనతకు నిదర్శనా లనిపించుకున్న చిత్రాలు 'ట్రేడర్ హారన్, 'గాన్ విత్ ది విండ్', 'మ్యూటినీ ఆన్‌ది బౌంటీ, మిసెస్ మినివర్' మొదలైనవి ఎన్నో ఉన్నాయి మరణకాలం నాటికి ఆయన వయస్సు 72 ఏళ్లు. ★

రోహిణీవారి 'గజదొంగ' లో ఎన్ టి రామారావు



# కుమ్మరి మొల్ల

బాలకరకూ మతిరూపేణా వ్యక్తమయ్యే శైవవైష్ణవాలకు జరిగిన ఘర్షణ ఈ నాటకానికి చారిత్రికత్వాన్ని ఆపాదించింది మొల్లతండ్రి (శివకేశవులకు భేదం లేదనే) శైవుడు గ్రామంలో నివసించేవారందరూ వైష్ణవులు రాజకుటుంబంకూడా వైష్ణవమేగనుక వైష్ణవ పెత్తందార్లు శైవాన్ని అణగద్రొక్కే విషయంలో జనసామాన్యాన్ని అణగద్రొక్కడానికి ప్రయత్నించినట్లు ఈ నాటకం తెలుపుతోంది

ఈ నాటకంలో పాల్గొన్న నటీనటులందరూ సమర్థులు కుమ్మరి మొల్లగా మారి రామం నటించింది చిన్నపిల్లయినా అతితేరిన నటివలె ఈమె ప్రేక్షకులను ముగ్ధుల్నిచేసింది పేదవాళ్ళను రెచ్చగొడుతున్న నేరానికి శిక్షగా ఆమెకు పెళ్ళిచేసి కట్టిపడెయ్యమనీ, లేకపోతే ఊరువిడిచి పొమ్మనీ రాయలవారి దళపతి మొల్ల తండ్రిని ఆజ్ఞాపిస్తాడు తండ్రి సౌఖ్యంకోరి తన ఇచ్ఛకు విరుద్ధంగా పెళ్ళిచేసుకోవడమా, లేక ఊరు విడిచిపోయి తండ్రిని కష్టపెట్టడమా అని మొల్ల అంతరాత్మతో మథనపడేటప్పుడు, శ్రీరామచంద్రుని భర్తగా తలచి అడవులకు వెళ్ళిపోయేటప్పుడు, తదితర ఘట్టాల్లోను ఈమె చూపిన నటన ప్రశంసాపాత్రమైనది

గ్రామంలో అన్యాయాలన్నిటికీ ఆదిపురుషుడైన అవధానిగా నాగభూషణం అత్యుత్తమంగా నటించాడు తరవాత పేర్కొనవలసిన నటన రామకోటిది మొల్లను పెళ్లాడతానని కూర్చున్న పిచ్చితిక్కన్నగా ఈయన చాలా హాస్యం సరఫరా చేశాడు బొర్రయసెట్టిగా చదలవాడ కుటుంబరావు హాస్యంకూడా ప్రేక్షకులను అలరించింది మిగతా పాత్రలు ధరించిన పెరుమాళ్లు, వల్లం నరసింహారావు, కొండా శేషగిరిరావు, సత్యం, రామనాథశాస్త్రి, సూర్యనారాయణ, మొగిలీశ్వర్, నేలనూతల శర్మ, దేవదాసిగా నటించిన శ్రీమతి లక్ష్మీ చక్కగా నటించి ప్రదర్శనను జయప్రదం చేశారు అశ్వద్ధామ, బి గోపాలం, రామారావు సంగీతం నిర్వహించారు

ముఖ్యంగా చెప్పుకోవలసింది సెట్సు, లైటింగు రామాలయం, మొల్ల ఇల్లు, మొదలైన సెట్స్ అన్నీ ఆయా ఘట్టాలకు ప్రత్యేక రామణీయకం చేకూర్చాయి సమయానికి, భావానికి తగినట్టుగా మార్చబడిన లైటింగ్ చాలా తెలుగు సినిమాల్లో కంటే సహజంగా, విశిష్టంగా ఒప్పింది

దక్షిణ ఇండియా సైక్యసంఘంవారి దసరా మహోత్సవ సందర్భంగా ఈ నాటకం ప్రదర్శింపబడింది ★



పొన్నలూరివారి 'శోభ'లో అంజలీదేవి

# నీగ్రో గాయని

(12-వ పేజీ తరవాయి)

ఇప్పుడీమె ఆసియా దేశాలలో వివిధ నగరాలలో కచేరీలు జరుపుతూ లక్షలాది శ్రోతలకు తన మధురకంఠం (కంట్రాల్టో) వినిపింపజేస్తోంది సేవూల్, సైగాన్, బాంకాక్, మనీలా, హాంకాంగ్, రంగూన్ మొదలైన నగరాలు పర్యటించి ఈనెల 11వ తేదీన ఈమె మద్రాసు వస్తోంది మద్రాసు తరవాత బొంబాయి, న్యూఢిల్లీ, కలకత్తా నగరాల్లో ఈమె కచేరీలు జరుపనున్నది

కోకిల నల్లనిదే కాని బాహ్యసౌందర్యానికి అతీతమైన హృదయగత సౌందర్యం కోకిల కలకూజితంలో ప్రతిధ్వనిస్తుంది అలాగే, ఈ నీగ్రోగాయని కంఠంలో కేవలం శబ్దమాధుర్యమే కాక, దాన్ని మించిన ఏదో అనిర్వచనీయమైన హృదయసౌందర్యం వ్యక్తమవుతున్నట్లనిపిస్తుంది ఈమె 1940లో తనకు వచ్చిన 10 వేల డాలర్ల బహుమతి ధనాన్ని ఒక నిధిగా ఏర్పరచి ఉత్సాహము, అర్హతగల సంగీత విద్యార్థులకు ఉచిత వేతనా లివ్వడానికి వినియోగిస్తోంది ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd by S Radha Krishna at The Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street Madras 1 Editor S Sambhu Prasad



సరస్వతి [శిల్పం]

ఫొటో: వి. కేశవశర్మ.

Regd. No. M. 4479. 

25 000 మైళ్ళ అంటే భూమి చుట్టూ ఒక సారి తిరిగి వచ్చే దాని కంటె ఎక్కువ దూరము! దూర ప్రయాణము సాగించే యీ సమయములో అతనికి ఎంతో శక్తి అవసరము ఈ శక్తిని పొదుపు చేకూర్చే వనస్పతితో వండిన ఆహారము అతనికి యిచ్చును

# 25,000 మైళ్ల దూర ప్రయాణమునకు ప్రారంభము!

## ఎదుగుతున్న పిల్లలకు అవసరమైన శక్తిని సమకూర్చుటలో వనస్పతి సహకరించును

రోజుకి ఒక మైలు చొప్పున నడుస్తూంటే, మీ పిల్లవాడు జీవిత కాలములో 25,000 మైళ్లకు పైగా వెళ్లవచ్చును ఈ ప్రయాణము సునాయాసముగా కొనసాగించుటకు వానికి అతి ముఖ్యముగా కావలసిన శక్తిని కలిగియున్నాడని చూచే బాధ్యత మీదే

### వాని నిత్య ఆహారము నుండి శక్తి

వానికి కావలసిన యీ శక్తి వాని నిత్య ఆహారము నుండి, ముఖ్యముగా [illegible]ముగ శక్తినిచ్చు జిడ్డు పదార్థముల నుండి లభిస్తోంది. జిడ్డు పదార్థములు శక్తి నిచ్చుటయే కాక ఆహారములోని విటమిను 'ఎ' మరియు 'డి' గుణములను దేహమునకు లభించేలా చేయును మరియు రోగములు రాకుండా అడ్డుటలో సహాయపడును. జిడ్డు పదార్థములు లభించుటకు పెద్ద కుటుంబముగల తల్లులు పోషకమైన, పొదుపైన వనస్పతితో వంట చేస్తారు.

### మీకు మీరే నిర్ధారణ చేసుకోండి

మీ వంటకములన్నిటిని వనస్పతిలో వండుట నేడే ప్రారంభించి, అది మీ కుటుంబమునకు ఎంత లాభసాటిగా ఉందో మీకు మీరే నిర్ధారణ చేసుకోండి. ఈ శుద్ధమైన శాక నూనెల నుండి తయారైన పదార్థములో వండిన వంట కుటుంబములో అందరూ రుచిగా ఉందని సంతుష్టి పడుట మీరు చూస్తారు. అంతే కాకుండా, మీ వంటకములను దీనిలో వండితే మీ కుటుంబ ఆహారము పూర్వము ఎప్పటి కంటె ఎక్కువ పోషకమైనదిగా మరియు పొదుపుగా అగును! వనస్పతి ప్రతి ఔన్సు 700 ఇంటర్‌నేషనల్ యూనిట్ల విటమిను 'ఎ'తో పుష్టికరముగా చేయబడినదని కూడ జ్ఞాపకము ఉంచుకోండి!

# వనస్పతి

## గృహిణులకు వరప్రసాదము!



VMA 1592

వనస్పతి మ్యాన్యుఫేక్చరర్స్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా వారిచే ప్రచురింపబడినది